


# క్రాకీస్
## ఛూయింగ్ గమ్!

క్రాకీస్ ఛూయింగ్ గమ్స్—ఎన్‌పి వారి ఉత్కృష్ట ఉత్పాదన—పిన్నల అభిరుచుల కనుగుణంగా పిప్పర్‌మెంట్, అనాస, టూటీఫ్రూటి, నారింజ, సుపారి సువాసనలలో దొరుకుతాయి.
ఇంక, ఎన్‌పి బబుల్ గమ్స్ సర్వజనామోదాలు. ఇవిగాక, బాన్‌బైట్—చాక్లెట్‌తో కూడిన మిఠాయి—పండ్ల రుచులతో బాల్ గమ్స్—ఎన్ పి వారి ఇతర ఉత్పాదనలు.

## రుచి చూసి పొందండి మంచి ఆనందం




ISI మార్కుగల ఛూయింగ్ గమ్స్, బబుల్ గమ్స్ ఒక NP వి మాత్రమే.

జేబునిండా NP స్వీట్స్ నింపుకోండి.

ది నేషనల్ ప్రోడక్ట్స్
బెంగుళూరు.




*Dattaram-NP-I TEL*




# అమృతాంజన్ లిమిటెడ్‌వారి విశిష్ఠమైన

# ఆముదము

శుద్ధిచేసినది.
వాసనలేనిది.







అమృతాంజన్ ఆముదము ఆరోగ్యవంతమైన కుటుంబాలకు

OBM 3270/3 TG

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ ["గీతారహస్యం"] నిజ్జయ్య రచన.

ఈ సంచికతో "మిత్రభేదం" ముగిసింది. పై సంచిక నుంచి "మిత్ర సంప్రాప్తి" ఆరంభమవుతుంది.

డబ్బు అందరినీ ఆకర్షిస్తుంది. కాని డబ్బు వెంట రకరకాల సంస్కృతి ఉంటుంది. డబ్బు అండన బతుకు దామనుకునే వాళ్ళు తమకు ఆ సంస్కృతి సరిపడుతుందో లేదో చూసుకోవాలి. "తల్లీ-కూతుళ్లు" కథలో నీతి ఇదే.

సంపుటి 58 ఫిబ్రవరి '76 సంచిక 2




CHITRA




## 32

రాజభవనంలో ఒక పెంపుడు కోతి ఉండేది. రాజు దానిని చూసి ముచ్చట పడి తన అంగరక్షకుడుగా నియమించాడు. ఆ కోతి దర్పంగా అతని కత్తి పట్టుకుని నడుస్తూంటే అందరూ విరగబడి నవ్వేవారు. రాజోచితమైన భోజనాలతో ఆ కోతి చక్కగా తయారయింది. రాజోద్యోగులందరికీ అది అంటే చాలా ఇష్టం. రాజుకు ఆ కోతి మీత అమితమైన అప్యాయతా, విశ్వాసమూ ఏర్పడి, దానికి ఒక సొంత ఖడ్గం ఏర్పాటు చేశాడు. అది అస్తమానమూ దాన్ని పట్టుకుని తిరుగుతూండేది.

రాజభవనం సరసన ఒక అందమైన తోట ఉండేది. అందులో రకరకాల పూలూ, పళ్ళూ ఉండేవి. ఒక శీతాకాలపు వెన్నెలరాత్రి పూల మొక్కల మధ్య వాహ్యాళి చేద్దామని, రాజూ, రాణీ ఆ తోటలో ప్రవేశించారు. పరివారమంతా తోట ద్వారం వద్ద ఆగిపోయింది, కాని కోతి మాత్రం వారి వెంట ఉన్నది. చాలా సేపు వెన్నెలలో పూల సౌందర్యం చూసి ఆనందించి, రాజదంపతులు ఒక పొదరింట ప్రవేశించారు.

రాజు కోతితో, "నేను నిద్ర పోతాను. నిద్రపోయేటప్పుడు నాకు ఏమీ హాని రాకుండా చూస్తూ ఉండు." అని నిద్ర పోయాడు. తరవాత కొంతసేపటికి రాణి కూడా నిద్రపోయింది. కోతి మాత్రం కత్తి భుజాన పెట్టుకుని నిలబడింది.

కొంతసేపటికి, పువ్వుల మధ్య తిరుగుతున్న తుమ్మెద ఒకటి, రాజు శరీరం నుంచి వస్తున్న సువాసనల చేత ఆకర్షించబడివచ్చి, రాజు తలమీద వాలింది.

అట్ట చివరి బొమ్మ

ఇదిచూసి కోతి మండిపడి, "ఏమిటీ? నేనిక్కడ ఉండగానే ఈ క్షుద్ర కీటకం రాజు తలమీద వాలటానికి సాహసిస్తుందా?" అనుకుని, ఎడమచేత్తో దాన్ని తోలేసింది. కాని అది మళ్ళీ ఎగిరివచ్చి రాజు తలమీద వాలింది. కోతి దాన్ని ఎన్నిసార్లు తోలినా అది మళ్ళీ వచ్చి రాజు తల మీదనే వాలుతున్నది.



కోతి కోపం పట్టలేక, "ఉండు, నీ పని చెబుతా," అంటూ తన చేతిన ఉన్న బరువైన ఖడ్గం ఎత్తి బలంగా తుమ్మెదను కొట్టింది. ఆ దెబ్బకు రాజు తల రెండుగా చీలింది. రాజు పెద్ద చావుకేకపెట్టి, ఆ క్షణంలోనే మరణించాడు.

ఆ కేకకు రాణి లేచి, కోతితో, "పాపీ, నీ మీద ఎంతో విశ్వాసం ఉంచిన రాజును ఇలా చేశావేం?" అని అడిగితే, కోతి జరిగినదంతా చెప్పింది.

మంత్రి కొడుకు అక్కడికివచ్చి, జరిగినది తెలుసుకుని, "మూఢుడైన మిత్రుడి కన్న వివేకి అయిన శత్రువుమేలు. రాజును చంపుదామనుకున్న శత్రువు వివేకి కావటం చేత రాజు ప్రాణాలు కాపాడాడు. ఆ రాజే బుద్ధిలేని మిత్రుడైన కోతిచేత చచ్చిపోయాడు," అన్నాడు.

కరటకం దమనకానికి ఈ కథ చెప్పి, "మన సింహానికి నీ వంటి మూఢుడైన అప్పుడి కన్న వివేకం గల శత్రువు ఉంటే బాగుండేది. గుర్తుంచుకో, ఎప్పటికైనా తప్పు తప్పే, ఒప్పు ఒప్పే. ఎంత దాహం వేసినప్పటికీ మనుషులు మురికి గుంట నీరు తాగరు. కాని నీలాటి రాజకీయ వేత్తల అభిప్రాయాలు అస్తవ్యస్తంగా ఉంటాయి. మిణుగురుపురుగు అగ్ని అనిపిస్తుంది; ఆకాశం చదునుగా తోస్తుంది; అబద్ధం నిజంగానూ, నిజం అబద్ధంగానూ కనిపిస్తుంది. ఎందుకూ? స్వార్థదృష్టి తప్ప మరేదీలేకపోవటం చేత. నీ వంటి ఒక్క స్వార్థబుద్ధి ఒక్కడి మాటలు వినేకన్న, అనుభవం గల హితైషులను పదిమందిని సంప్రతించటం

మన పాలకులు నేర్చుకోవం మంచిదని నిన్ను చూసి గ్రహించాలి,'' అన్నది.

దమనకానికి ఈ మాటలు ఏమాత్రమూ తలకెక్కలేదు. అది కపటంగా నవ్వి, తన అన్నను విడిచి వెళ్ళిపోయింది.

ఈలోపల పింగళకమూ, సంజీవకమూ తిరిగి పోరాటం మొదలు పెట్టాయి. పింగళకం తీవ్రంగా గాయపడినప్పటికీ చిట్టచివరకు సంజీవకాన్ని చంపేసింది.

రక్తం ఓడుతూ పడిఉన్న తన పాత మిత్రుడి శవాన్ని చూస్తూ ఉంటే పింగళకానికి జాలి పుట్టుకొచ్చింది.

''అహా! ఎంతపని చేశాను! అతనే నేనూ, నేనే అతనూగా ఉంటిమే! అతన్ని చంపి, నేను కూడా సగం చచ్చాను,'' అనుకున్నది పింగళకం.

దమనకం పింగళకం వద్దకు వచ్చి, ''మహారాజా, ఎందుకు విచారంగా ఉన్నారు? తండ్రి అయేది, తమ్ముడయేది, కొడుకు అయేది, మిత్రుడయేది, రాజు శత్రువును విధిగా చంపాలి. దుర్బలుడైన రాజునూ, నిగ్రహం చాలని న్యాయాధిపతినీ, నీతి లేని భార్యనూ, కపట మిత్రుణ్ణీ, పొగరుబోతు సేవకుణ్ణీ శీఘ్రంగా తొలగించాలి. సాధారణ వ్యక్తులు పాటించే నీతి సూత్రాలు రాజులకు వర్తించవు. ఇతరులలో దోషమనిపించుకునేది రాజులో సాధారణంగా గుణం అనిపించుకుంటుంది. రాజు సమయోచితంగా, విశ్వాసంగానూ, విశ్వాసరహితంగానూ ఉండాలి; క్రూరుడుగానూ, దయామయుడుగానూ ఉండాలి; దాతగానూ, లోభిగానూ ఉండాలి; ధనాన్ని మంచినీరు లాగానూ, మందు లాగానూ వాడాలి. మీ సింహాసనానికి గాలం వేసిన ఈ సంజీవకాన్ని చంపటం చాలా మంచిపని,'' అన్నది.

ఈ మాటలతో పింగళకానికి మనోవేదన తగ్గింది. అది దమనకాన్ని తన మంత్రిగా పెట్టుకుని, అరణ్యరాజ్యాన్ని పాలించసాగింది.

—(మిత్రభేదం సమాప్తం)





## 2

[జయశీలు డనే యువకుడు. దుర్వ్యసనాలకు లోనై, తండ్రి యిచ్చిన ఆస్తి అంతా కొద్దికాలంలోనే పోగొట్టుకున్నాడు. ఆ స్థితిలో అతడికి, జూదగృహం వద్ద ఒక రాజోద్యోగితో వైరం కలిగింది. రాజు, అతడికి దేశబహిష్కరణ శిక్ష విధించాడు. జయశీలుడు తానున్న దేశం వదిలి, కొన్నాళ్ళకు మరొక దేశపు రాజధానీనగర ప్రాంతాలను చేరాడు. తరవాత—]

ఆ రాత్రికి జయశీలుడు అక్కడ వున్న పెద్ద ఊడలమర్రి కింద కాలం గడప దలిచాడు. చీకటిపడి నగరం ప్రవేశించటం క్షేమం కాదని అతడికి తోచింది. చింపి గుడ్డలతో, దుమ్ము కొట్టుకున్న దేహంతో వున్న అతణ్ణి రాజభటులు చూస్తే, ఏ దొంగో, తొడుబోతో అని అనుమానించి ఖైదు చేయగలరు! అనవసరంగా చిక్కుల్లో ఎందుకుపడాలి?

ఇలా ఆలోచించి, జయశీలుడు మర్రి చెట్టు పాదంలో భూమి నుంచి పైకి వచ్చిన ఒక లావుపాటి వేరును తలగడగా పెట్టుకుని పడుకున్నాడు. కొంతసేపటికి అతడికి నిద్ర ముంచుకు వచ్చింది. సరిగా నడిరేయి వేళ, దాపుల నక్కల కూతలు విని, అతడు కళ్ళు తెరిచాడు. కొంచెం దూరంలో చెట్లచాటు నుంచి చిన్న వెలుగూ, పొగా అతడి కంటబడినై.



''ఓహోం, నేనేదో శ్మశానప్రాంతంలోని ఊడలమర్రి కింద నిద్రిస్తున్నట్టున్నది! ఇలాంటి చోట్ల భూత ప్రేత పిశాచాలుంటవని అంటారే! ఏవీ, అలాంటివేమీ యిక్కడ వున్నట్టులేదు.'' అనుకుంటూ జయశీలుడు చీకటిగుయ్యారంగా వున్న మర్రి కొమ్మల్లోకి చూశాడు. అక్కడ అతడి కేమీ కనిపించ లేదు. తనకు కలిగిన అనుమానానికి తనలో తాను చిన్నగా నవ్వుకుని, జయశీలుడు కత్తిపిడిని ఒకసారి తాకిచూసి, తిరిగి కళ్ళు మూసుకున్నాడు.

ఈసారి అతడికి కునుకుపట్టే సమయానికి, దూరం నుంచి, ''రక్షించండి! రక్షించండి! మహాకాలుడు మింగ జూస్తున్నాడు!'' అన్న ఆర్తనాదం వినిపించింది.

జయశీలుడు చప్పునలేచి, కత్తిదూసి ఆ ఆర్తనాదం వచ్చిన వైపుకు పరిగెత్తాడు. అదొక శ్మశానం! అక్కడ దూరదూరంగా రెండు మూడు శవాలు కాలుతున్నవి. ఆ మంటల వెలుగులో నల్లటి వస్త్రాలు ధరించి, జుట్టు విరబోసుకుని ఆర్తనాదాలు చేస్తూ పరిగెత్తుతున్న మనిషి ఒకడు, అతడికి కనిపించాడు. నిలువెల్లా తెల్లని వస్త్రం కప్పుకున్న ఆకారం ఒకటి, అతణ్ణి వెంటబడి తరుముతున్నది.

జయశీలుడు కత్తిపైకెత్తి ఆర్తనాదాలు చేస్తున్న వాడి కేసి పరిగెత్తుతూ, ''భయపడకు, భయపడకు! నీ ప్రాణాలు బలిగొననున్న ఆ దుర్మార్గుణ్ణి నా కత్తికి బలి చేస్తాను.'' అంటూ కేకపెట్టాడు.

ఆ కేక వింటూనే నల్లని వస్త్రాలు ధరించినవాడు, జయశీలుడి కేసి పరిగెత్తుకు రాసాగాడు. తెల్లని ఆకారం అతణ్ణి తరుముకువస్తూ, ''ఆగు, ఆగు! మహాకాలుడి బంటునైన, ఈ కాలకాలుడిని చూసి భయపడే నీవు; మహాకాలుణ్ణే ఆవాహన చేయచూస్తావా ?'' అని అరుస్తున్నది.

జయశీలుడు, ఆ కాలకాలుణ్ణని చెప్పుకునేవాణ్ణి అడ్డగించి, ''ఓరీ, నువ్వెవరైనా

నాకు భయం లేదు. కాని, వెన్నిచ్చిపారి పోయేవాణ్ణి, వెంటబడి తరిమి చంపాలని చూడటంమాత్రం, సహించను,'' అన్నాడు.

ఆ మాటలు వింటూనే కాలకాలుడు వికృతంగా నవ్వి, ''సెహబాస్, యువకుడా! నీలో కొంచెం వీరయువకుడి లక్షణాలున్నై. ఏదీ; నా నిజరూపం చూడు!'' అంటూ కప్పుకున్న తెల్లవస్త్రాన్ని తీసి, దూరంగా పారవేశాడు.

ఇప్పుడు ఆ కాలకాలుడి రూపం అతి భయంకరంగా వున్నది. నల్లని శరీర ఛ్ఛాయతో, నిప్పులు చెరుగుతున్న కళ్లతో, నోట మంటలు కక్కుతూ అతడు భయంకరంగా గర్జనచేశాడు.

జయశీలుడు ఒక్క తృటికాలం నిశ్చేష్టుడయాడు. కాని, అంతలోనే తెప్పరిల్లి, కత్తిని కాలకాలుడి గుండెలకేసి గురిచేసి, ''దుష్టుడా! నీ వికృతరూపానికి నేను భయపడతాననుకోకు. పారిపోయే వాణ్ణి చంపచూసే నీవు, ఏరకం పిరికిపందవైవుంటావు?'' అని అడిగాడు.

ఆ మాటలతో కాలకాలుడు ఒక్కడుగు వెనక్కువేసి, ''యువకుడా, నీ ధైర్యానికి మెచ్చాను. అమానుషశక్తుల్ని, మహాసత్వులు మాత్రమే తమ అధీనంలో వుంచుకోగలరు. ఇప్పుడు నన్ను ఆవాహన చేసిన సిద్ధసాధకుడు అల్పసత్వుడు!



అలాంటివాణ్ణి ప్రాణాలతో వదలరాదు. అడ్డం తొలుగు!'' అంటూ ముందుకు దూకబోయాడు.

జయశీలుడు కత్తిని, కాలకాలుడి వక్షానికి అడ్డంగా పెట్టి, ఆర్తనాదాలు చేసిన సిద్ధసాధకుడు, ఎక్కడ వున్నాడో అని, వెనక్కు తిరిగి చూశాడు. సాధకుడు భయవిహ్వలత్వం వల్ల, తను పారిపోయేందుకు సరయిన మార్గం ఏదో కూడా చూసుకోకుండా, శ్మశానంలోనే గిరికీలు కొడుతూ, యింకా ఆర్తనాదాలు చేస్తూనే వున్నాడు.

జయశీలుడు, తాను ముందు సిద్ధసాధకుడి దగ్గిరకుపోయి, అతడికి ధైర్యం



చెప్పటం బావుంటుందేమో అనుకునేంతలో, కాలకాలుడు హుమ్, అంటూ హుంకరించి, కత్తిని చేత్తో పక్కకు నెట్టాడు.

జయశీలుడు చప్పున కాలకాలుడి కంఠాని కేసి కత్తి విసిరాడు. ఆ దెబ్బకు వాడి తల మొండెం నుంచి వేరైపోయి, అంత దూరాన పడింది. మరుక్షణం కింద పడిన తల నేలమీద ఎగిరెగిరిపడుతూ, బిగ్గరగా నవ్వి, "జయశీలా! నిస్సంశయంగా నువ్వు మహా వీరుడివి. నా కంఠ రక్తంలో తడిసిన నీ కత్తి అమోఘశక్తులు కలది! వెళ్ళు, నువ్వు కోరినవన్నీ సాధించుకో," అన్నది.

జయశీలుడు ఆ మాటలకు అబ్బురపాటు చెంది, ఒకటి రెండు క్షణాలు ఏమనేందుకూ తోచక ఆగి, చివరకు తెప్పరిల్లి, "కాలకాలా! నేనేవో అద్భుత కార్యాలు సాధించాలని, ఇల్లు వదిలిన వాణ్ణికాను. జీవనోపాధికి, ఏ రాజు దగ్గరనైనా ,చిన్న ఉద్యోగం దొరికితే చాలు. దానితో తృప్తిపడతాను," అన్నాడు.

కాలకాలుడి కంఠం జవాబివ్వలేదు. జయశీలుడు తెగిపడిన తలను సమీపించి, కత్తితో దాన్ని అటూ యిటూ కదిపి చూశాడు: జీవం వున్నట్టు లేదు. ఈ చచ్చినవాడెవడోగాని మంచి బలాఢ్యుడు. చెవులకూ, ముక్కుకూ వెండి పోగులూ; పుస్తెమీసాలూ, కంఠానికి గట్టిగా బిగించివున్న పూసలదండా, జయశీలుడి కంటబడినై.

జయశీలుడు కత్తిని తిరిగి ఒరలో పెట్టి, రక్షించమంటూ పరిగెత్తిన నల్లటి దుస్తులవాడి కోసం చుట్టూ కలయ చూశాడు. ఈసారి వాడెక్కడా వున్న సూచనలే లేవు. వాడేమై వుంటాడు? భయంతో గుండెపగిలి, యీ చుట్టు పక్కల వున్న చెట్ల కింద ఎక్కడైనా పడిపోలేదుకదా? ఇలా ఆలోచిస్తూ, జయశీలుడు తాను ముందు పడుకున్న ఊడలమర్రి కేసి నడిచాడు.



ఇప్పుడు మర్రిచెట్టు కొమ్మల్లో గుడ్లగూబల అరుపులతో పాటు, దూరంగా నక్కల కేకలు కూడా ప్రారంభమయినై. ఇక అక్కడ తాను నిద్రించటం సాధ్యపడదనుకున్నాడు, జయశీలుడు. పైగా దాహంతో అతడి నాలుక పిడచకట్టుకుపోతున్నది.

"రాత్రి మూడవజాము గడిచినట్టున్నది. ఈ చుట్టుపక్కల ఎక్కడైనా కొలను లాంటిది వుంటే దాహం తీర్చుకుని, స్నానం చేసి తూర్పు తెల్లనవుతూండగానే నగరంలోకి పోవాలి. దుస్తులు చీలికలూ వాలికలూ అయివున్నా, నడుం నుంచి వేళ్ళాడుతున్న యీ కత్తి ఒర మీదా, పిడ మీదా వున్న నగిషీపనిచూసి, నేనేదో గొప్ప కులీనుణ్ణనే జనం అనుకుంటారు. ఈ చిరుగు దుస్తులకు కారణం; అరణ్యంలో ఒక సింహాన్నెదుర్కొని హోరాహోరిగా పోరాడటం అని చెపుతాను!" అనుకుంటూ జయశీలుడు మర్రిచెట్టు దగ్గిర నుంచి బయలుదేరాడు.

అలా అతడు కొంత దూరం నడిచేసరికి, ఒక చిన్న ఇల్లూ, ఆ ఇంటి కిటికీ లోంచి వెలుగుతున్న దీపం అతడి కంటబడినై. ఆ ఇంటివారినడిగి ముందు దాహం తీర్చుకోవచ్చుననుకుంటూ, "అయ్యా, నేను బాటసారిని. ఇంత మంచి నీరిచ్చి దాహం తీర్చగలరా?" అని కేకపెట్టాడు జయశీలుడు.

ఆ వెంటనే ఇంటి తలుపు తెరుచుకున్నది. ఒక వృద్ధురాలు దీపం చేతబట్టుకుని, బయటి చీకటిలోకి చూస్తూ, "చీకటి పడగానే, ఏ సత్రంలోనో పడుకుని నిద్రించక, ఇంత రాత్రివేళ ప్రయాణం చేస్తున్నావా? లోపలికిరా, మంచి నీరిస్తాను," అన్నది.

జయశీలుడు లోపలికి వెళ్ళాడు. వృద్ధురాలు అతణ్ణి దీపపు కాంతిలో పరీక్షగా చూసి, ఆశ్చర్యపోతూ, "నువ్వేదో వయసుమళ్ళిన, తీర్థయాత్రలకుపోయే బాటసారివనుకున్నాను. ఇదేమిటి? ఇంత

చిన్నవయసులో కత్తి నడుముకు కట్టుకుని, అర్ధరాత్రి వేళ యీ అరణ్య ప్రాంతాల్లో తిరుగుతున్నావు ? '' అన్నది.

జయశీలుడు జవాబు చెప్పబోయాడు. కాని, వృద్ధురాలు అతణ్ణి వారించి, '' ముందు దాహం తీర్చుకో, మంచి నీరు తెస్తాను. అదుగో, ఆ బల్ల మీద కూర్చో,'' అని పక్క గదిలోకిపోయి, ఒక పెద్ద గ్లాసునిండుగా నీరు తెచ్చి అతడి కిచ్చింది.

జయశీలుడు నీరుతాగి, '' అమ్మా, నా ప్రాణాలు నిలిపావు. ఈ ఇంటిలో మరెవరూ వున్నట్టులేదే !'' అన్నాడు.

'' ఎవరూ లేరు, నాయనా ! నాకు సంతానం కలగలేదు. నా భర్త సంవత్సరం కిందట చనిపోయాడు. ఆయన రాజాశ్రితుడు. నిరాధారురాలనైన నాకు రాజుగారు, నా భర్త జీతంలో మూడోవంతు భరణంగా యిస్తున్నాడు. దాని ఆధారంతో ఒంటరిగానే, యీ ఇంట్లో కాలం వెళ్ళబుచ్చుతున్నాను,'' అన్నది వృద్ధురాలు.

'' అమ్మా, నేనీ ప్రాంతాలకు కొత్తగా వచ్చినవాణ్ణి. ఈ దాపులనున్న నగరం పేరేమిటి ? రాజుగారి పేరేమిటి ?'' అని అడిగాడు జయశీలుడు.

ఆ ప్రశ్నకు వృద్ధురాలు చిన్నగా నిట్టూర్చి, ''నాయనా, ఇది హిరణ్యపురం. రాజుగారి పేరు కనకాక్షుడు. ఎంతో ప్రజా




హితంగా రాజ్యపాలన చేసే ధర్మాత్ముడు. కాని, ఆ మధ్య నెల రోజుల కిందట పెళ్ళీడు వచ్చిన ఆయన కుమార్తెనూ, యౌవరాజ్య పట్టాభిషేకం చేసుకోనున్న ఆయన కొడుకునూ, ఎవరో అపహరించుకుపోయారు. ఆ నాటి నుంచి రాజుగారు దిగులుతో మంచం పట్టారు,'' అన్నది.

కూతురూ, కొడుకూ కనిపించకుండా పోయిన దిగులుతో మంచం ఎక్కిన రాజును ఉద్యోగంకోసం అర్థించటం ఎలా? అనుకున్నాడు జయశీలుడు. ఆ వెంటనే అతడికి తన భుక్తి గడిచే మార్గం కన్న, ముందు రాజుగారు పడ్డ చిక్కుల గురించి తెలుసుకోవాలనిపించింది.

"అమ్మా, రాజుగారి కొడుకూ, కుమార్తెల్ని ఏ శత్రురాజో రహస్యంగా ఎత్తుకు పోయి వుంటాడు. అంతేనా?" అని అడిగాడు జయశీలుడు.

"అలా జరిగివుంటే చిక్కేమున్నది, నాయనా! ఆ శత్రురాజును చంపి కనకాక్ష రాజుగారు, తన పుత్రీ పుత్రుల్ని ఇంటికి తెచ్చుకునేవాడు. ఆ ఎత్తుకు పోయన వాడెవడో రాక్షసుడో, యక్షుడో అనుకుంటున్నారు," అన్నది వృద్ధురాలు.

ఆమె మాట ముగించే లోపలే ఇంటి ముందు కలకలం బయలుదేరింది. ఒకడు ఏడ్పు గొంతుతో, "అయ్యా, శ్మశానంలో నా తండ్రి తల నరికినవాడు యిటే వచ్చాడు. ఈ బ్రాహ్మణావిడ ఇంట్లో దీపం వెలుగుతున్నది. ఆమె ఏమైనా వాణ్ణి చూసిందేమో అడగండి!" అంటున్నాడు.

"ఒరే, కాటికాపరి వెధవా, నోరు మూసుకో! ఆ మహా వీరుడు చంపింది భూతగణాల పెద్ద అయిన కాలుణ్ణి. సిద్ధ సాధకుణ్ణయిన నాకు, యిలాంటి విషయాలన్నీ క్షుణ్ణంగా తెలుసు!" అంటున్నాడు మరొకడు కోపంగా.

వాళ్ళిద్దర్నీ గదమాయిస్తూ మరొక గొంతు, "మీ రిద్దరూ కాస్త ఆగండి. చచ్చిన ముసలి కాటికాపరి మళ్ళీ ఎలా బతికాడు, అన్నదానితో పాటు సర్వం విచారించమని, నగర రక్షకుణ్ణయిన నన్ను, మంత్రిగారు పంపారు. నాకు అడ్డు రాకండి!" అన్నది.

ఈ సంభాషణ విన్న జయశీలుడు, వృద్ధురాలితో, "అమ్మా, నా కోసం నగర రక్షకుడూ, కొందరు భటులూ వచ్చినట్టున్నది. నీ ఇంట నేను కనబడటం క్షేమమా? లేక పెరటి ద్వారం గుండా బయటికి వెళ్ళమన్నావా?" అన్నాడు.

వృద్ధురాలు జవాబు చెప్పే లోపలే, నగరరక్షకుడు వీధి ద్వారాన్ని సమీపించి, "లోపల వున్నవారెవరో వెంటనే తలుపు తెరవండి!" అంటూ అధికార స్వరంతో కేక పెట్టాడు.

—(ఇంకా వుంది)





# అపహాస్యం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీలాటి ఉత్తముడు ఇలాటి క్షుద్రకర్మ చెయ్యకూడదు. అది పత నానికే దారి తీస్తుంది. అందుకు నిదర్శ నంగా నీకు రంగేశుడు అనే దొంగల నాయకుడి కథ చెబుతాను, శ్రమ తెలియ కుండా విను." అంటూ ఇలా చెప్ప సాగాడు :

పూర్వం రంగపురం అనే నగరానికి సమీపంలో గల అరణ్యంలో ఒక గజ దొంగ తన పరివారంతో సహా ఉండేవాడు. ఆ గజదొంగ కొడుకే రంగేశుడు. రంగే శుడు మంచి సూక్ష్మబుద్ధి కలవాడు. వాడు తన పధ్నాలుగో ఏట నుంచీ తండ్రితో

బేతాళ కథలు



తిరిగి, తండ్రి అనంతరం దొంగల నాయకుడు కాదగిన నైపుణ్యం సంపాదించాడు.

చిన్నవాడుగా ఉండగానే ఒకసారి రంగేశుడు తన తండ్రి వెంట రంగపురంలో జరిగే ఉత్సవాలకు పోయి, ఒక చోట భగవద్గీతా పఠనం విన్నాడు. ఆ రోజున వాడు గ్రహించిన దేమంటే, ప్రపంచంలో జరిగే దానికంతా అసలైన బాధ్యుడు దేవుడు; పోతే, మనిషి ఏ ధర్మం ఆచరించి నప్పటికీ, తనకు కలిగే మంచి, చెడ్డలకూ, సుఖదుఃఖాలకూ అంటకుండా ఉంటే వాడికి మోక్షం లభిస్తుంది. ఈ భావాలు రంగేశుడి మనసులో గాఢంగా నాటుకున్నాయి.

తండ్రి శ్రమఫలితంగా కొంత కాలానికి వాడు దొంగలముఠాకు నాయకుడు అయాడు. తనవృత్తి ధర్మం ప్రకారం దొంగతనాలూ, దారి దోపిడీలూ చేస్తూ, చాలా ధనం సంపాదించాడు. కాని అతను ఏనాడూ భగవద్గీతలో విన్నది మరిచి పోలేదు. అతని మనోనిగ్రహమూ, దేవుడిలో విశ్వాసమూ ఏ మాత్రమూ సడలలేదు.

రాజుగారి భటులు అప్పుడప్పుడూ అరణ్యంలో ఉండే దొంగల మీదికి దాడి చేస్తూ ఉండేవారు. అలా ఒకసారి ఆకస్మికంగా దాడి జరిగేసరికి, దొంగలు ఎక్కడి వాళ్ళక్కడ తమ రహస్యస్థావరాలకు పారిపోయారు. రంగేశుడు కూడా విధిగా పారిపోవలసి వచ్చింది.

అతను తన గుర్రం మీద చాలా దూరం పరిగెత్తిపోయి, అమితమైన దాహబాధతో ఒక ముని ఆశ్రమం చేరాడు. ఆశ్రమంలో ఒక చెట్టు కింద ముని తపస్సు చేసుకుంటూ, సమాధిలో ఉన్నాడు. ఆయన పక్కన కమండలం ఉన్నది గాని, అందులో నీరులేదు.

గత్యంతరం లేక, రంగేశుడు ఆ ముని భుజం తట్టి, "అయ్యా, తాగటానికి మంచి నీరు ఇప్పించండి!" అని అడిగాడు.

ముని కళ్ళు తెరిచి, ఆగ్రహంతో, "ఓరీ, మూర్ఖుడా! నా తపస్సు భగ్నం

చేసినందుకు శిల అయిపో!" అని శపించాడు.

"ముందు కాస్త మంచి నీరు తాగటానికి ఇయ్యండి!" అన్నాడు రంగేశుడు.

తనలో అంత తపశ్శక్తి ఉన్నా కూడా తన శాపం రంగేశుడికి తగలకపోయే సరికి, ముని ఆశ్చర్యపడి, రంగేశుడు మహాపురుషుడు అయి ఉండాలనుకుని, తన శక్తిచేత కమండలంలో నీరు తెప్పించి, రంగేశుడికి ఇచ్చాడు. రంగేశుడు తన దాహం తీర్చుకుని, తన తప్పు క్షమించమని మునిని కోరి, తన ఇంటికి తిరిగి వెళ్ళిపోయాడు.

రంగేశుడికి ఒక కొడుకు ఉండేవాడు. వాడు కాలక్రమాన పెరిగి పెద్దవాడయ్యాడు. రంగేశుడు తన కొడుకు పెళ్లి చాలా వైభవంగా జరిపించాడు. అరణ్యంలో ఈ పెళ్ళి మూలంగా జరిగిన సంచలనం గూఢచారులు పసిగట్టి, రాజుకు తెలిపారు. రాజు పెద్ద సేనను పంపాడు. అది అర్ధరాత్రి సమయంలో దొంగల స్థావరాన్ని చుట్టుముట్టింది. రంగేశుడి పరివారమంతా సైనికులకు చిక్కారు. రంగేశుడి కొడుకూ, అతని కొత్త వధువూ కూడా సైనికులకు దొరికిపోయారు. ఒక్క రంగేశుడు మాత్రం చాకచక్యంతో తప్పించుకుని, తన గుర్రం మీద పారిపోయాడు.

రాజు దొంగల నందరినీ చెరలో పెట్టించి, వారం రోజులలో రంగేశుడు



వచ్చి పట్టుబడకపోతే, నూతన వధూవరులైన అతని కొడుకు, కోడళ్ళ తలలు తీయించి కోటగుమ్మానికి వేళ్ళాడదీయిస్తానని చాటింపు వేయించాడు.

అయితే ఈ చాటింపు జరిగే సమయానికి రంగేశుడు చాలా దూరాన ఉండిపోవటం చేత అతనికి సకాలంలో వార్త అందలేదు. వార్త అంది, అతను తిరిగి వచ్చేసరికి గడువు దాటిపోయింది. రంగేశుడు రాజుగారి కోటకు వచ్చి, కోటగుమ్మాన వేళ్ళాడుతున్న తన కొడుకు, కోడళ్ళ తలలు చూసి, దుఃఖం పట్టలేక, ''అయ్యయ్యో! ఈ పాపిష్ఠి రాజు అక్రమంగా అమాయకులైన ఇద్దరి ప్రాణాలు పొట్టన పెట్టుకున్నాడే!'' అని ఆక్రోశించాడు.

మరుక్షణమే రంగేశుడు శిలగా మారిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, ముని శపించినప్పుడు శిలగా మారని రంగేశుడు ఏ శాపమూ లేకుండానే ఎందుకు శిలగా మారాడు? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''ముని శాపం తగలక పోవటానికి కారణం రంగేశుడిలో ఉండిన గొప్ప శక్తి. ఆ శక్తి భగవంతుడియందు అతనికి గల పూర్తినమ్మకం వల్లా, తాను ఏమి చేసినా నిమిత్త మాత్రుణ్ణి అని మనస్ఫూర్తిగా నమ్మటం వల్లా వచ్చింది. కాని తన కొడుకు, కోడళ్ళ తలలను కోటగుమ్మం మీద చూడగానే అతని విశ్వాసం పోయింది. అతను వాళ్ళిద్దరినీ రక్షించే ఉద్దేశంతో రావటంలోనే దైవనిర్ణయం మీద అతని విశ్వాసం చలించింది. వాళ్ళ చావుకు రాజే పూర్తిగా బాధ్యుడని అనుకోవటంతో విశ్వాసం పూర్తిగాపోయింది. వెంటనే అతనికి ముని శాపం తగిలింది,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)







# తల్లీ-కూతుళ్లు

ఒక ఊళ్ళో రామశాస్త్రి అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. ఆయన వేదశాస్త్రాలు చదివిన జ్ఞాని. ఆయన పౌరోహిత్యం చేసుకుంటూ, ఎవరికి ఏ ఇబ్బంది కలిగినా చేదోడువాదోడుగా ఉండేవాడు. అందువల్ల ఆయనను ఊళ్ళో అందరూ ఎంతో గౌరవించేవారు. కాని ఆయన భార్య సుబ్బమ్మ దృష్టిలో ఆయన ఒక సామాన్య పురోహిత బ్రాహ్మణుడు మాత్రమే.

తన భర్త కన్నా విద్యావివేకాలు తక్కువ వున్నవారు, ఎక్కువ సంపాయించడమూ, తన భర్త పరోపకారం పేరిట సంపాదన మీద అసక్తి చూపక పోవడమూ ఆమెకు సబబు కాదనిపించేది. మాటిమాటికీ, లౌక్యంగా నడచుకోమని ఆమె భర్తకు సలహాలు ఇచ్చేది. ఆయన అందుకు ఒప్పుకోక, ''పదిమంది కష్ట సుఖాలలో పాలు పంచుకోవడమే పెద్ద కలిమి!'' అని ఆమెకు హితవు చెబుతుండేవాడు.

ఆయన కోరిక ప్రకారం ఇరుగు పొరుగు వాళ్ళకు సాయం చెయ్యడం సుబ్బమ్మకు కష్టంగా ఉండేది.

రామశాస్త్రికి ముగ్గురు పిల్లలు కలిగారు. తండ్రి వాళ్ళ జాతకాలు చూసి, వారి భవిష్యత్తుకు తగినట్టుగా వారికి లక్ష్మి, కళావతీ, ధీరమతీ అని పేర్లు పెట్టాడు. లక్ష్మిది ధన యోగం. కళావతి అనేక కళలలో ఆరితేరుతుంది. ధీరమతి ఎలాంటి పరిస్థితులనైనా తట్టుకుని, చలించకుండా నిలబడగలదు.

ఆ అక్కా చెల్లెళ్ళ జీవితాలు రామశాస్త్రి అనుకున్నట్టే రూపొందాయి. లక్ష్మిని ఒక సంపన్నుడు పెళ్ళాడాడు. ఆమె కాపరానికి రాగానే ఆమె అతవారి సంపద అంతకంతకూ పెరిగిపోయింది.

---

బూర్లె నాగేశ్వరరావు

---



కళావతికి చిన్నతనం నుంచీ నాట్యం లోనూ, సంగీతంలోనూ, అభిరుచి ఉన్నది. ఆమె తన తెలివితేటలన్నీ ఆ కళలు అభ్యసించడంలో వినియోగించింది. రామశాస్త్రి కూడా ఆమెకు ఎంతో ప్రోత్సాహం ఇచ్చాడు. ఆ ప్రోత్సాహంతో ఆమె ఆ కళలలో ఆరితేరింది. ఆమెను కళాభిమానం గల ఒక ఉన్నతోద్యోగి కొడుకు పెళ్ళాడాడు. ఆమె రాకతో వారి ఇల్లు కళా నిలయం అయిపోయింది. దేశంలోని కళాకారు లెందరో కళావతి ఇంట చేరి గోష్ఠి జరుపుతూండేవారు.

ధీరమతికి మాత్రం పెద్ద సంబంధం కుదరలేదు. ఆమెను పెళ్ళాడడానికి ఎవరూ ముందుకురాలేదు. రామశాస్త్రి ఎంతో ప్రయత్నం మీద ఒక చిన్న గ్రామంలో ఉండే పురోహితుడి కిచ్చి పెళ్లి చేశాడు. సుబ్బమ్మకు ఆ సంబంధం చెయ్యడం ఏమాత్రమూ ఇష్టం లేదు. కాని ధీరమతి మాత్రం తన అక్కలకు వచ్చిన గొప్ప సంబంధాల వంటిది తనకు రాలేదని చింతించలేదు. "తెలివిగా బతకటానికి ఐశ్వర్యం అవసరం లేదు," అన్నదామె.

ముగ్గురు కూతుళ్ళకూ పెళ్ళిళ్ళు చేసిన కొద్దికాలానికే రామశాస్త్రి జబ్బు పడ్డాడు. తన ఆయుర్దాయం తీరిపోయిందని తెలుసుకుని ఆయన తన కూతుళ్లకు కబురు చేయించాడు. పెద్దవాళ్ళిద్దరూ రాలేదు. కాని ధీరమతి మాత్రం కబురు అందగానే వచ్చి వాలింది. లక్ష్మి, కళావతీ రానందుకు రామశాస్త్రి ఎంతగానో బాధపడ్డాడు.

సుబ్బమ్మ మాత్రం వాళ్ళిద్దరినీ సమర్థిస్తూ, "లక్ష్మి కదిలిరావాలంటే మాటలా? వాళ్ళ ఇల్లు పెద్ద దివాణ మాయె! పిల్ల ఎంత బరువు బాధ్యతలు మోస్తున్నదో మీకేంతెలుసు? ఇక కళావతి మాట చెప్పనే అక్కరలేదు. దాని ఇంటికి దేశదేశాల కళాకారులూ వస్తుంటారు, పోతుంటారు. అదొక రాజుగారి విడిదిలా

ఉంటుంది. దాని నుంచి బయట పడడం మాటలా?'' అన్నది.

రామశాస్త్రి అందుకేమీ జవాబు చెప్ప లేదు. నానాటికీ ఆయన జబ్బు ముదిరింది. కొంచెం ఆలస్యంగానైనా పెద్ద కూతుళ్ళు కూడా వచ్చారు. లక్ష్మి వచ్చి చేరుతూనే ఎక్కడినుంచో గొప్ప వైద్యులను పిలిపించి, తండ్రి వద్దంటున్నా వినకుండా, ఏవేవో చికిత్సలు చేయించింది. కాని ఆయన జబ్బు తగ్గుముఖం పట్టలేదు.

ఒకరోజు రామశాస్త్రి తన భార్యను దగ్గరికి పిలిచి, "నా కాలం ముగిసింది. నా అనంతరం నువు ధీరమతి దగ్గరే ఉండిపోవటం మంచిదని నా సలహా,'' అన్నాడు రహస్యంగా.

భర్త మాటలకు సుబ్బమ్మకు కోపం వచ్చింది. "మీకు ధీరమతి అంటే ఎందుకంత పక్షపాతం? అసలు దానికి ఉంటే కదా, నాకు పెట్టేది? లక్ష్మికి అంత ఐశ్వర్యం ఉందికదా, అది నన్ను పోషించదా? లేక అది కఠినాత్మురాలని అనుకుంటున్నారా? కళావతి ఇంటికి యాత్రీకుల్లాగా ఎవరెవరో వచ్చి పోతుంటారు గదా? నేను దానికి భారమవుతానని ఎలా అనుకున్నారు? ధీరమతి దారిద్ర్యాన్ని పెంచటానికి నన్ను కూడా వెళ్ళి దాని గొంతుమీద కూర్చోమంటారా?" అన్నదామె.

అందుకు రామశాస్త్రి ఏమీ అనలేదు. తరవాత కొంతసేపటికే ఆయన తన





భార్యను కూతుళ్ళకు అప్పగించి, కన్ను మూశాడు.

రామశాస్త్రి అంత్యక్రియలు యథావిధిగా జరిపించి, సుబ్బమ్మ భర్త సలహా పాటించకుండా, పెద్ద కూతురు లక్ష్మి వెంట ప్రయాణమయింది. అక్కడ ఆమెకు అతిథి సత్కారాలు చాలా చక్కగా జరిగాయి. భర్త బతికి ఉన్న రోజుల్లో ఇంటిపనితో బాటు, ఇరుగు పొరుగు వారికి చిన్నచిన్న సహాయాలు చేసిపెట్టేపని కూడా ఉండేది. కూతురింట అటువంటి బాదరబందీ ఏమీ లేకుండా తిని కూర్చుని, సుఖపడటమంటే అదే అనుకున్నది ఆమె. అయితే ఆ సుఖం ఎక్కువ రోజులు సాగలేదు. తల్లి ఏ పనీ చెయ్యకుండా గృహదేవత లాగా కూర్చోవడం లక్ష్మికి చాలా చిరాకు తెప్పించింది. ఆ ఇంట్లో అందరికీ బరువూ, బాధ్యతా ఉన్నాయి. అందరికీ సుబ్బమ్మ ప్రవర్తన ఎబ్బెట్టుగానే ఉంది. లక్ష్మి అత్తగారు సూటిపోటి మాటలు అన్నప్పటికీ సుబ్బమ్మ గ్రహించలేదు.

చివరకు లక్ష్మి అత్తగారు లక్ష్మితో, "నాకు కూడా మీ అమ్మలాగా విశ్రాంతి తీసుకోవాలనిపిస్తున్నది. నేనూ ఆమె ఈడుదాన్నే. నా కెందుకీ వెట్టిచాకిరీ? నా భర్తా, నా కొడుకూ ఇద్దరూ సంపాయిస్తున్నారు. పెట్టేదానివి నువు ఉన్నావు. మీ అమ్మనూ, నన్నూ నువే చూసుకో," అన్నది.

ఆమె అన్నంత పనీ చేసింది. బండెడు చాకిరీ లక్ష్మి మీద పడింది. తన తల్లి వచ్చేదాకా ఎంత చాకిరీ అయినా చేసిన తన అత్తగారు ఏ పనీ చెయ్యకుండా పోవడం చూసి, లక్ష్మి తన తల్లికి పనులు చెప్పటమూ, కొన్ని పనులు ఆమె మీదే వదిలెయ్యటమూ మొదలు పెట్టింది.

సుబ్బమ్మ తనకు ఇష్టం లేకున్నా పనులు చెయ్యటం మొదలు పెట్టింది. అయితే ఆ పనులకు అంతే ఉండేది కాదు. భర్తతో బాటు దారిద్ర్యం అనుభ

వించినప్పుడు కూడా ఆమె అంత చాకిరీ చేసి ఎరగదు. ఇలా కొన్నాళ్ళు గడిచాక ఆమె లక్ష్మిని, "ఒకటీ అరాపని చెయ్యొచ్చు. కాని అతిథిగా వచ్చిన బంధువును, అందునా కన్నతల్లినే, ఇలా పనిమనిషిలా చూస్తావా?" అని అడిగింది.

"అతిథులు నీలాగా ఎల్లకాలం ఉండిపోతారా? అయినా నీకు ఇక్కడ ఏం తక్కువయిందీ? నీకు ఇక్కడ బాగా లేదనిపిస్తే, మిగిలిన ఇద్దరు కూతుళ్లలో ఎవరి దగ్గరికయినా వెళ్ళొచ్చుగా?" అన్నది లక్ష్మి నిక్కచ్చిగా.



ఆ మాటలు విన్నతర్వాత సుబ్బమ్మకు అక్కడ ఉండాలనిపించ లేదు. ధీరమతి ఇంట్లోకన్నా, కళావతి ఇంట తనకు సుఖంగా ఉండగలదనే అభిప్రాయంతో ఆమె కళావతి ఇంటికి చేరుకుంది. తల్లిని చూసి కళావతి పరమానందం చెంది, గొప్ప కళాకారుల నెందరినో ఆమెకు పరిచయం చేసింది. సుబ్బమ్మ లక్ష్మి ప్రవర్తన గురించి చెప్పేసరికి, కళావతి ఎంతో నొచ్చుకుని, "నువు జీవితాంతం ఇక్కడే ఉండు. నిన్ను ఎవరూ అడిగేవారు ఉండరు," అన్నది.

అయితే సుబ్బమ్మకు అక్కడి వాతావరణం చూస్తే చాలా రోతపుట్టింది. కళావతి ఇంట ఒక శౌచమూ, ఒక ఆచారమూ అంటూ లేదు. కులగోత్రాలు తెలియని నానా రకాల మనుష్యులూ వచ్చేవారు. తల్లికి ఆచారమని తెలిసి కళావతి వంటమనిషిని మాన్పించింది. దాంతో వచ్చేపోయేవారి కందరికీ వండడమూ, వడ్డించడమూ సుబ్బమ్మ మీద పడింది. ఆమెకు ఆ ఇంటి తిండి సహించ లేదు. ఆమె కూతురితో, "అమ్మాయీ! మన కులమేమిటి, ఆచారమేమిటి? మన ఇంట ఇంత అనాచారం ఉండేదా! ధర్మసత్రాలలో కూడా ఇంత సంకరంగా ఉండదు కదా?" అన్నది.

"అదేమిటమ్మా! కళలకు కులగోత్రాలతో నిమిత్తం ఏముంది? ఈ ఇంట

అందరు కళాకారులకూ చోటు ఉంటుంది. నీ మడీ, ఆచారమూ ఇక్కడ ఎలా సాగుతాయి? అప్పటికీ నీ కోసం బంగారం లాంటి పనిమనిషిని తీసేశాను. నీకు ఇంతకన్న ఇక్కడ నేనేం చెయ్యగలను? నీ ఆచారాల ప్రకారం జరగాలంటే ధీరమతి ఇంట జరుగుతుందేమో! నీకిక్కడ ఉండడం ఇష్టం లేకుంటే అక్కడికి వెళ్ళి చూడు," అన్నది కళావతి.

ఇక చేసేదేమీ లేక సుబ్బమ్మ ధీరమతి ఇంటికి చేరుకుంది. ధీరమతి తనను సరిగా చూడదని ఆమె అనుకొంది. "నాన్న ఉన్నప్పుడు నిన్ను కష్టపెట్టకుండా చూచుకున్నారు. ఇక ఇప్పుడు మాత్రం నీ వెందుకు కష్టపడాలమ్మా! నీకేం కావాలన్నా నేను చేస్తాను! నీవు విశ్రాంతిగా ఉండు," అన్నది ధీరమతి తల్లితో. ఆమె అలాగే నడచుకుంది కూడా.

తన ఆఖరు కూతురి జీవితం చూసి సుబ్బమ్మ ఆశ్చర్యపడింది. ధీరమతి ఐశ్వర్యవంతురాలు కాదు. అయినా ఆమెకు ఏ లోటూ లేదు. ఇంటి పనంతా చెయ్యడంతో బాటు, ఆమె ఆ ఊళ్ళో ఎవరికైనా ఏదైనా అవసరం వస్తే చేదోడు వాదోడుగా ఉండేది. అందువల్ల ఆమెను అవసరం కలిగినప్పుడు ఆదుకోవడానికి ఊరివారు సిద్ధమయ్యేవారు.

ధీరమతి మంచితనం చూసిన సుబ్బమ్మకు భర్త మాటలు గుర్తుకు వచ్చాయి. ధీరమతికి డబ్బు లేకపోయినా పదిమందికీ సాయపడాలనే గుణముంది. ఎదుటివారు కష్టపడితే ఆమె చూడలేదు. అందుకే తనను ఆమె బాగా చూచుకోగలదని తన భర్త అనుకున్నాడని సుబ్బమ్మ గ్రహించింది. సుఖపడడానికి డబ్బు ఒక్కటే చాలదని ఆమెకు అర్థమైంది.

ఆ తర్వాత ఆమె కూతురితో బాటు, ఆ ఊరివారి కష్టసుఖాలు కనుక్కుంటూ వారికి తన చేతనైన సాయం చేస్తూ హాయిగా గడిపింది.



# 170. భూగర్భ గుహలు

నల్ల సముద్రప్రాంతంలో నోవీ అఫోన్ అనే గ్రామం సమీపంలో భూగర్భంలో చాలా లోతున తొమ్మిది గుహలు ఉన్నాయి. ఈ గుహల మొత్తం నిడివి 800 మీటర్లు. ఏ గుహకు ఆ గుహ ఒక ప్రత్యేక సుందర దృశ్యం. ఇంతకన్న పెద్ద గుహలు అమెరికాలో మాత్రమే ఉన్నాయి. సోవియట్ ప్రభుత్వం ఇప్పుడు ఈ గుహలను టూరిస్టులకు అందుబాటులోకి తెచ్చింది.






# మహత్తర మూలిక

సోమశేఖరుడు అనే యువకుడు చాలా కాలం తన అవ్వ రెక్కల కష్టంతో పెరిగి, ఆమె పోగానే దిక్కూ, దరీ లేనివాడై పోయాడు.

ఆ ఊళ్ళోనే రామయ్యతాత అనే వైద్యుడు ఉండేవాడు. నలభై ఏళ్ళ క్రితం ఎక్కడినుంచో ఆ ఊరికి వచ్చి, స్థిరపడి, చుట్టుపక్కల ఊళ్ళలో గొప్ప వైద్యుడని పేరు తెచ్చుకున్నాడు. ఆయనకు ఏదో మహత్తర మూలిక తెలుసు. ఆయన రహస్యంగా అడవికి వెళ్ళి, ఆ మూలిక తెచ్చి, దానితో ఇతర దినుసులు చేర్చి నూరి, గుళికలు చేసేవాడు. ఆయన గుళిక ఒక్కటి వేసుకుంటే, ఎలాటి జబ్బు గాని ఎగిరి చక్కాపోతుందని ఆ ఊరి ప్రజల నమ్మకం.

రామయ్యతాత డెబ్భైఅయిదేళ్ళ వృద్ధుడు. ఆయనకు ఎవరూ లేరు. ఆయన దగ్గిర చేరి, మూలిక రహస్యం తెలుసుకుంటే, జీవితాంతమూ సుఖంగా బతకవచ్చునని సోమశేఖరుడు ఆలోచించాడు.

ఈ ఆలోచనతో వాడు రామయ్యతాత ఇంటికి వెళ్ళాడు. లోపల గుళికలు చేసుకుంటున్న ముసలాయన తన పని కట్టిపెట్టి, ఇవతలికి వచ్చి, ''నీకేమీ జబ్బులేదు. నిక్షేపంలా ఉన్నావు. ఇంటికి వెళ్ళు.'' అన్నాడు.

''నేను జబ్బు నయంచేసుకోవటానికి రాలేదు. ఈ ముసలితనంలో నీకు అండగా ఉందామని వచ్చాను. నాకు ఇంటి దగ్గిర పని ఏమీలేదు,'' అన్నాడు సోమశేఖరుడు.

''నీ చేత చేయించుకునే పని కూడా నాకు ఏమీలేదే!'' అన్నాడు ముసలాయన.

ఎం. కామేశ్వరరావు

"ఇంటి పని అంతా చేస్తాను. అడవికి వెళ్ళి నీకు కావలసిన మూలికలు తెస్తాను," అన్నాడు సోమశేఖరుడు.

ముసలాయన సోమశేఖరుణ్ణి ఎగాదిగా చూసి, "సరే, ఇంటి పని నువు చూడు. మిగిలిన పని నేను చూసుకోగలను," అన్నాడు.

సోమశేఖరుడు నిరుత్సాహపడక, ఆ రోజే పనిలో చేరాడు. ముసలాయన వాణ్ణి అన్నిపనులూ చెయ్యనిచ్చేవాడు, కాని మూలికలు తేవటానికి అడవికి వెళ్ళేటప్పుడు తన వెంట రానిచ్చేవాడు కాదు; తాను గుళికలు తయారుచేసేటప్పుడు సోమశేఖరుణ్ణి ఆ చాయల ఉండనిచ్చేవాడు కాదు.

మూడు మాసాల అనంతరం, ఒకనాడు సోమశేఖరుడు ముసలాయన దగ్గిర తన మనసులో మాట చెప్పుతూ, "తాతా, నువు కాటికి కాళ్ళు చాచుకుని ఉన్నవాడివి. అన్ని రోగాలూ నయం చెయ్యగల శక్తి నీకున్నది. మహత్తరమూలిక ఒకటి నీకు తెలుసు. దాని రహస్యం నీతోనే పోవటం మహా అన్యాయం! అదేదో నాకు చెప్పు. నీ అనంతరం నేను నీ పేరు మీదుగా వైద్యం చేస్తాను. అందరూ నీ పేరు చెప్పుకుని ఇంట్లో దీపం పెట్టుకుంటారు," అన్నాడు.



రామయ్యతాత విరగబడి నవ్వి, "నా కేంరా? దుక్కలా ఉన్నాను. ఇప్పుడప్పుడే చస్తానని భ్రమపడకు," అన్నాడు.

ఆ తరవాత సోమశేఖరుడు ఆ విషయం మరి ఎత్తలేదు. ఒక సంవత్సరం పాటు వాడు ముసలాయనకు శ్రద్ధగా సేవలు చేశాడు. ఈ కాలంలో ఇద్దరి మధ్యా, వారికే తెలియకుండా, ఒకరిమీద ఒకరికి ఎంతో ఆప్యాయత ఏర్పడింది.

ఒక రోజు రామయ్యతాతకు పెద్ద జబ్బు చేసింది. ఆయనను చూసి సోమశేఖరుడు కళ్ళ నీరు పెట్టుకుని, "రెండు గుళికలు మింగు, తాతా, జబ్బు పోతుంది," అన్నాడు.

ముసలాయన నీరసంగా నవ్వి, "ఇంక ఈ ఘటం వెళ్ళిపోతుందిరా. ఇది గుళికలతో నయమయే జబ్బు కాదు," అన్నాడు.

తరవాత ఆయన వాడితో, "మూలికా రహస్యం చెప్పమన్నావా?" అన్నాడు.

"ఇప్పుడు వద్దులే, తాతా. కాస్సేపు విశ్రాంతి తీసుకో. ముందు నీ జబ్బు నయంకానీ," అన్నాడు సోమశేఖరుడు.

ఆ రాత్రి రామయ్యతాత, తన మంచం పక్కనే నేలమీద పడుకున్న సోమశేఖరుణ్ణి లేపి, "నాయనా, నా మూలికా రహస్యాన్ని తాటాకు మీద రాసి, పెట్టెలో పెట్టాను. నేను పోయాక తీసి చదువుకో," అని పడుకున్నాడు.

అలా పడుకున్న మనిషి మరి లేవలేదు.

సోమశేఖరుడు రామయ్యతాత కోసం తండ్రి పోయినంతగా ఏడ్చాడు. వాడు రామయ్యతాతకు శ్రాద్ధ కర్మలు యథావిధిగా చేశాడు. ఇక వాడికి ఆ ఇంట ఉండ బుద్ధిపుట్టలేదు. వాడు ఆ ఇల్లు వదిలి పోదామనుకుంటూండగా, రామయ్యతాత తనతో అన్న చివరి మాటలు గుర్తుకు వచ్చాయి.

వాడు పెట్టెలో నుంచి తాటాకు తీసి ఇలా చదువుకున్నాడు:

"నాయనా, శేఖరం. ఆఖరుదశలో నువు నాకు దిక్కు అయావు. మూలికా రహస్యం తెలుసుకోవటానికే నువు నా దగ్గిర చేరావు. అయితే రానురాను ఇద్దరమూ స్నేహితులమయాం. నాకు తెలిసిన మహత్తర మూలిక ఏమిటో తెలుసునా? ప్రజల విశ్వాసం! నాకు ప్రజల విశ్వాసం లభించగానే నా గుళికలకు మహత్తర శక్తి వచ్చింది. నేను పోయాక నా ఇల్లు నీదే. పెరట్లో జామచెట్టు కింద నా డబ్బు చాలా దాచాను. దానితో నీ యిష్టం వచ్చిన వ్యాపారం చేసుకో. నీకు మేలు కలుగుతుంది."

సోమశేఖరుడు మనసులో రామయ్యతాతకు ధన్యవాదాలు చెప్పుకుని, అయన చెప్పిన ప్రకారమే చెయ్యటానికి నిశ్చయించుకున్నాడు.



# మేలులో కీడు

రామవయ్య ఊరికి దూరంగా ఒక నిమ్మతోట కొన్నాడు, కాని దాని కాయలు అతను కళ్ళ చూడలేదు. వాటిని ఎవరో కోసుకుపోతున్నారు. కాపలా మనిషిని పెట్టినా లాభం లేకపోయింది. వాడు దొంగలకు సహాయపడ్డాడు.

రామవయ్యకు రామదాసు అనే స్నేహితుడు వున్నాడు. అతను నాటకాలలో చిల్లర వేషాలు కట్టటంలో నిపుణుడు. తాను దయ్యంవేషం వేసి నిమ్మతోట చాయలకు దొంగలు రాకుండా హడలెత్తిం చేస్తానన్నాడు. అతని ఎత్తు పారింది. నిమ్మతోట దయ్యాలతోట అని పేరు తెచ్చుకున్నది. ఆయేడు రామవయ్యకు తోట మీద మంచి రాబడి వచ్చింది. ఆ ధైర్యంతో అతను తోట మీద చాలా పెట్టుబడి చేస్తూ, అందుకుగాను అప్పు కూడా చేశాడు.

కాని మరునటి ఏడు నిమ్మతోట కాపుమీద ఉండగా గాలివాన వచ్చి, పిందెలురాలి, చెట్లు పడిపోయి అమిత నష్టం వచ్చింది. తోట అమ్మేసి అప్పులు తీరుద్దామనుకుంటే, దయ్యాల తోట అని ఎవరూ కొనటానికి ముందుకురాలేదు.

చివరకు రామవయ్య దాన్ని రామదాసుకే కారుచౌకగా అమ్మాడు.

—చెల్లూరి సీతారాజేశ్వరరావు





# బందిపోటు నాయకుడు

చౌంబాల్ ప్రాంతంలో షేర్‌సింగ్ పేరు చెబితే హడలు. అతను దయాదాక్షిణ్యాలు ఎరగని కర్కోటకుడు. అతను ఎరిగినది డబ్బూ, హత్యలు చెయ్యటమూనూ. అతని అనుచరులు అతని ఆజ్ఞమీరితే మరణ శిక్ష పొందేవాళ్ళు. ఆ మరణశిక్ష ఎలా జరిగేదంటే, పట్టాకత్తిని విషంలో ముంచి పొట్టలో దిగపొడిచే వాళ్ళు. నిందితుడు వెంటనే చచ్చేవాడు.

షేర్‌సింగ్, అతని అనుచరులూ కొండగుహలలో నివసించేవారు. అక్కడికి దగ్గిరలో ఫలవంతమైన గ్రామాలుండేవి. బందిపోటు దొంగలు ఆ గ్రామాల వాళ్లను బెదిరించి, ధాన్యమూ, ఇతర వస్తువులూ వసూలు చేసేవారు. వాళ్ళు రాత్రివేళ దూర ప్రాంతాలు కొల్లగొట్టి, తమ గుర్రాల మీద చీకటి మాటున గుహల్లోకి పారిపోయేవాళ్ళు.

షేర్‌సింగ్ ఒకప్పుడు సైనికుడుగా పనిచేసి అన్నిరకాల తుపాకులనూ ఉపయోగించటంలో ప్రవీణుడయాడు. అతను సేనలో ఉండగానే అతని భార్య చనిపోయినట్టు వార్త వచ్చింది. అతను వచ్చి చూసేసరికి అతని ఇల్లు బూడిద కుప్ప అయి ఉన్నది. ఆ దౌర్జన్యానికి కారకుడు ఆ ఊరి జమీందారు. ఆయనే షేర్‌సింగ్ భార్యనూ, అతని చిన్న కొడుకునూ హత్యచేయించాడు.

కోపం పట్టలేక, షేర్‌సింగ్ ప్రహరీ గోడ దూకి జమీందారు ఇంట జొరబడి, పడకటింటి తలుపులు పగలగొట్టి, జమీందారునూ, అతని కుటుంబాన్ని దారుణంగా హత్య చేశాడు. తన పగతీరగానే అతనికి భయం పట్టుకున్నది. అతను అరణ్యాలకు పారిపోయాడు. పోలీసులు అతని కోసం వెతికారు. కాని ప్రయోజనం లేక

ఏ. సి. సర్కార్, ఇంద్రజాలికుడు

పోయింది. అతన్ని పట్టి ఇచ్చిన వారికి పెద్ద బహుమతి ప్రకటించారు.

అతను నిద్రాహారాలు లేకుండా ఒక రహస్య స్థావరానికి మారుతూ, ఒక రోజు శంకర్‌సింగ్ నాయకత్వంగల బందిపోటు ముఠాకు తారసపడ్డాడు. వాళ్ళ రహస్య స్థావరాలు అతను కనిపించిన ప్రాంతంలోనే ఉండటం చేత, అతను పోలీసు గూఢచారి అని అనుమానించి, దొంగలు అతన్ని కొట్ట బోయారు. కాని శంకర్ సింగ్ వారిని వారించి, షేర్‌సింగ్‌ను ఎగాదిగా చూసి, "పోలీసులు వెతుకుతున్న షేర్‌సింగ్ లాగున్నాడు. ఇతన్ని పట్టిచ్చిన వారికి పదివేల రూపాయలు బహుమానం ప్రకటించారు. బందీగా పట్టుకోండి," అన్నాడు.

షేర్‌సింగ్‌ను తమ స్థావరానికి చేర్చిన అనంతరం శంకర్‌సింగ్ అతన్ని అనేక విధాల ప్రశ్నించి, తృప్తిపడి, అతన్ని తన ముఠాలో చేర్చుకున్నాడు. షేర్‌సింగ్ తుపాకి ఉపయోగించటంలో సామర్థ్యం గలవాడనీ, అతని గురి అమోఘమనీ త్వరలోనే స్పష్టమయింది. మూడు నెలలు తిరిగేసరికల్లా అతను శంకర్‌సింగ్‌కు కుడిభుజం అయాడు. తరవాత కొద్ది కాలానికే, శంకర్‌సింగ్ పోలీసుల ప్రతి ఘటనలో గుండు తగిలి చావటమూ,



షేర్‌సింగ్ ముఠాకు నాయకుడు కావటమూ జరిగింది. వెంటనే అతను తన అనుచరులకు మంచి శిక్షణ ఇచ్చి, చాంబాల్‌లోయ మీద పడి, గ్రామాలలో ఉండే జమీందార్లతో యుద్ధం చేసి, వారి ఆస్తులు కొల్లగొట్టి, వారి పశువులను దోచుకుని తన భార్యాపుత్రుల చావుకు పగ తీర్చుకున్నాడు.

షేర్‌సింగ్ పెద్ద కొడుకు అజిత్‌సింగ్ అనేవాడు తన తండ్రి ఉండిన గ్రామానికి అయిదు మైళ్ళ దూరాన మరొక గ్రామంలో ఉన్న పినతల్లి వద్ద పెరిగాడు. ఒక రోజు షేర్‌సింగ్ అక్కడికి వెళ్ళి, తన వెంట అజిత్‌సింగ్‌ను తీసుకు వచ్చాడు. తన



కొడుకును తన ముఠాలో చేర్చి, బందిపోటుగా తయారు చెయ్యాలని అతని ఉద్దేశం. అజిత్ శిక్షణపొంది తుపాకి పేల్చటంలో సిద్ధ హస్తుడయాడు. కాని అతను తుపాకి మనిషి కేసి గురి చేసినప్పుడు అతని చేతులు వణికేవి. తండ్రిని తృప్తిపరచటానికి అతను దోపిడీలలో పాల్గొనే వాడన్న మాటేగాని, అతను ఎన్నడూ మనిషిని కాల్చి చంపలేదు. అతని తుపాకీ ఎప్పుడూ గురి తప్పేది.

ఒకసారి ఒక పెద్ద పోలీసు అధికారి నాయకత్వం కింద ఒక పోలీసు దళం, షేర్‌సింగ్ ముఠా ఉండే స్థావరాలు గల కొండ దిగువన శిబిరం వేశారు. వెంటనే షేర్‌సింగ్ వేగులవాళ్ళు అతనికి ఈ సంగతి తెలిపారు. షేర్‌సింగ్ ప్రతిచర్య నిర్ణయించి, దానికి తన కొడుకు అజిత్‌సింగ్‌ను నాయకుడుగా నియమించాడు. ఇరవైమంది మెరికల లాంటి దొంగలు ఆయుధాలు తీసుకుని, గుర్రాలెక్కి అజిత్‌సింగ్ వెంట బయలుదేరారు.

దొంగలు వేసిన మాటు ఫలించింది. చాలామంది పోలీసులు చచ్చారు. పోలీసులు విసిరిన చేతిబాంబు మూలాన ఇద్దరు దొంగలు కూడా చచ్చారు. చావగా మిగిలిన పోలీసులు పారిపోయారు. పోలీసుల ఆయుధాలు దొంగలకు దొరికాయి. పోలీసు అధికారి దొంగలకు చిక్కాడు.

"ఛోటా సర్దార్, ఇతణ్ణి మన సర్దారు దగ్గిరికి తీసుకుపోదాం. ఆయన స్వయంగా ఇతగాడి తల నరికేస్తాడు," అన్నాడు ఒక దొంగ అజిత్‌సింగ్‌తో.

"ఎందుకొచ్చిన శ్రమ? ఇతని అంతు నేనే తేలుస్తాను. ఇలా ఇయ్యి," అంటూ అజిత్‌సింగ్ అధికారి మెడపట్టి పట్టుకుని పొదల మధ్యకు ఈడ్చుకుపోయాడు. పోలీసు అధికారి పెనుగులాడి, తప్పించుకో జూశాడు, కాని అజిత్ పట్టు ఉక్కు పట్టు. అతను పోలీసు అధికారికి కన్ను మలిపి, పొదలమాటుకు తీసుకుపోయి, "చూడు, నేను నిన్ను చంపబో

వటం లేదు. నేను ఎన్నడూ హత్య చేసిన వాణ్ణి కాను,'' అన్నాడు.

పోలీసు అధికారి అజిత్‌సింగ్ కేసి అనుమానంగానూ, ఆశ్చర్యంతోనూ చూసి, "బందిపోటువు హంతకుడివి కాకపోవడ మేమిటి? మీ వాళ్ళు, మా వాళ్ళను ఎంద రినో చంపారు. షేర్‌సింగ్ మనుషులు హత్యలు చెయ్యరనటం హాస్యాస్పదం,'' అన్నాడు.

'' నా మాట నమ్ము. నేను విధి లేక బందిపోటు వృత్తిలో ఉన్నాను. నేను నీ కన్న మంచి పౌరుణ్ణే. కాలయాపన చెయ్యక, నేను చెప్పినట్టు చెయ్యి. నేను ఆ చెట్టు మీద తుపాకీ పేల్చుతాను. నువు చావు కేక పెట్టి, బోర్లా పడుకో. నేను కత్తితో నా తొడ కోసుకుని, నీ వీపు మీద రక్తం మరకలు వేస్తాను. నా మనుషులు ఇటు వస్తే ఆ రక్తం చూసి నువు చచ్చి పోయావనుకుంటారు. మేం వెళ్ళాక నువు ఇంటికి పో,'' అన్నాడు అజిత్.

అతను తాను చెప్పినట్టేచేసి, తన మనుషుల వద్దకు తిరిగి వచ్చాడు. అందరూ పొదల కుండా తిరిగి వచ్చే టప్పుడు చచ్చిపడి ఉన్న పోలీసు అధి కారి వాళ్ళకు కనిపించాడు.

'' ఛోటా సర్దార్, నీకు రక్తం కారు తున్నది? అది నువ్వు గమనించినట్టే



లేదు. ఏమయింది?'' అని ఒక దొంగ ఆత్రంగా అడిగాడు.

'' ఆ దరిద్రుడు నన్ను నా కత్తితోనే పొడిచాడు. ఫరవాలేదులే. స్థావరం చేర గానే కట్టు కట్టుకుంటాను,'' అన్నాడు అజిత్.

* * *

'' సర్దార్, నీ కొడుకు ద్రోహం చేశాడు! చిక్కిన శత్రువును, పోలీసు అధికారి కాపూర్‌ను తప్పించుకు పోనిచ్చాడు,'' అన్నాడు షేర్‌సింగ్ పెద్ద వేగులవాడు.

'' లేదు, చంపాడు! ఏం మాట్లాడు తున్నావో ఆలోచించి మరీ మాట్లాడు,'' అన్నాడు షేర్‌సింగ్ కఠినంగా.



"నేను కళ్ళారా చూశాను, సర్దార్. అతను తుపాకీతో కొట్టినది చెట్టును, పోలీసు అధికారిని కాదు. అతను కాపూర్‌ను చచ్చినట్టు పడుకోమని, తన తొడ చీరుకుని, అతని వీపు మీద రక్తం మరకలు వేశాడు. మీ రంతా అతను చచ్చాడని సంబరపడుతూంటే, అతను క్షేమంగా ఇల్లు చేరుకున్నాడు." అన్నాడు వేగులవాడు.

క్రోధంతో షేర్‌సింగ్, "అజిత్‌ను పిలు!" అని రంకెపెట్టాడు.

అజిత్ ధైర్యంగా వచ్చాడు.

"వీడు చెప్పేది నిజమా?" అని షేర్‌సింగ్ గర్జించాడు.

అజిత్ సూటిగా తండ్రి ముఖంలోకి చూస్తూ, "నిజమే, సర్దార్. కావలిస్తే నన్ను చంపుగాని, హత్యలు చెయ్యటానికి నన్ను పంపవద్దు. అది నా వల్ల కాదు. దయచేసి నన్ను క్షమించు, నాన్నా." అన్నాడు. అలా అంటూ అతను చప్పున ఏడ్చేశాడు.

షేర్‌సింగ్ తన అనుచరుల కేసి తిరిగి, "ఆజ్ఞలను ఉల్లంఘించే ఈ మనిషిని ఏం చెయ్యాలో చెప్పండి. వీడు నా కొడుకే కానీ, శాసనం అందరికీ శాసనమే. మీ నిర్ణయమేమిటో ఆలోచించి, రేపు చెప్పండి." అన్నాడు.

షేర్‌సింగ్ సైన్యంలో ఉండిన కాలంలో అతని ఇల్లు కనిపెట్టి ఉండటానికి జశ్వాల్ అనే వయసు మళ్ళిన నౌకరు ఉండేవాడు. షేర్‌సింగ్ తన కొడుకును తన వెంట తెచ్చినప్పుడు ఈ జశ్వాల్ కూడా వచ్చి బందిపోటులో చేరాడు. దొంగలందరికీ రుచిగా వంట చేసి పెట్టటం అతని పని. అంతేగాని అతను దాడులలో పాల్గొనేవాడు కాదు. పసితనం నుంచీ అజిత్‌ను పెంచినవాడు కావటం చేత జశ్వాల్‌కు అతనంటే చాలా ప్రేమ. అజిత్‌కు రానున్న భయంకరమైన చావు తలుచుకుని అతను కుప్పకూలి పోయాడు. షేర్‌సింగ్‌కు తన కొడుకు కన్న అనుచరులు

ఎక్కువ. పట్టాకత్తిని విషంలో ముంచి పొట్టలో పొడుస్తారు!

పట్టా కత్తిని పొట్టలో దిగపొడవటం గురించి అదే పనిగా ఆలోచిస్తూండగా జశ్వాలుడికి ఏనాటిమాటో ఒకటి గుర్తు వచ్చింది. యువకుడుగా ఉండగా అతను ఒక ఇంద్రజాలికుడి వద్ద పని చేసేవాడు. ఆ ఇంద్రజాలికుడు ఇదే అద్భుతం చేసేవాడు. అది చెయ్యటం జశ్వాల్‌కు కూడా తెలును.



అందుకు కావలసినది ఒక అర్ధ చంద్రాకారం గల గొట్టం. దాన్ని దుస్తుల చాటున మనిషి నడుముకు అమర్చుతారు. దాని ఒక చివర మనిషి బొడ్డు దగ్గిరా, ఒకటి వెనక వెన్ను దిగువనా ఉంటాయి. కత్తి సూటిగానూ, తేలికగా వంగేదిగానూ ఉండాలి. దాని మొన బొడ్డు వద్ద అనించి నింపాదిగా తోస్తే, కత్తి గొట్టం వెంబడి వంగుతూపోయి, వెన్ను వద్ద బయటికి వస్తుంది. రక్తం కూడా కనబరచాలంటే గొట్టంలో ఏ కోడి రక్తమో నింపి, గొట్టం చివరలు రెండూ మూసెయ్యాలి.

జశ్వాల్ వెంటనే ఒక పథకం ఆలోచించి, దొంగలకు కత్తులూ కటార్లూ చేసి పెట్టే కమ్మరి వద్దకు వెళ్ళి, అతని సహాయంతో తనకు కావలసిన విధంగా గొట్టం తయారుచేయించుకుని, అందరూ నిద్రపోతూన్న సమయంలో దాన్ని అజిత్ నడుముకు అమర్చాడు. రక్తం కూడా కనబడటానికి అతను ఆ గొట్టంలో కోడి రక్తం నింపాడు.

ఈ కమ్మరికీ, జశ్వాలుకూ మంచి స్నేహం. మిగిలిన దొంగలు బయటికి పోయినప్పుడు స్థావరంలో వీళ్ళిద్దరే మిగిలిపోతూండే వాళ్ళు.

మర్నాడు తెల్లవారు ఝామున దొంగలు సమావేశమై, అజిత్‌సింగ్‌కు మరణ దండన విధించాలని తమ నిర్ణయం తెలిపారు.

"మన ఆచారం ప్రకారం నిందితుణ్ణి వధించండి." అన్నాడు షేర్‌సింగ్.

జశ్పాల్ అతనితో, "అజిత్ నా చేతుల మీదిగా పెరిగాడు. అతన్ని నా చేతులతోనే చంపి, అతని జన్మస్థలంలో నేనే దహనం చేస్తాను. అనుమతి ఇయ్యి!" అన్నాడు.

"శిక్షితుడికి అభ్యంతరం లేకపోతే అలాగే చెయ్యి." అన్నాడు షేర్‌సింగ్ జీరపోయిన కంఠంతో.

"ఏమంటావు?" అని జశ్పాల్ అజిత్‌ను అడుగుతూ కన్ను మలిపాడు.

"నా చివరి కోరిక అదే." అన్నాడు అజిత్.

అతను చేతులు కట్టుకుని ముందుకు వచ్చి నిలబడ్డాడు. జశ్పాల్ కత్తి తీసుకుని, దాన్ని విషపు కుండీలో ముంచాడు. మిగిలిన దొంగలు తృప్తిపడి ఎడంగా వెళ్ళారు.

జశ్పాల్, "జై భవానీ!" అని అరిచి, కత్తి మొనను అజిత్‌సింగ్ పొట్టకు ఆనించి, బలంగా తోశాడు. కత్తిమొన అజిత్ వెన్ను నుంచి బయటికి వచ్చేటప్పుడు దాని వెంట రక్తం కూడా వచ్చింది. అజిత్ కిందపడి, కాళ్ళూ, చేతులూ తన్నుకుని, నిశ్చలంగా ఉండిపోయాడు. షేర్‌సింగ్ పెద్దగా అరిచి, కళ్ళు చేతులతో కప్పుకున్నాడు.

అంతా అయిపోయింది. జశ్పాల్ కత్తిని లాగేసి ఒరలో పెట్టేశాడు. అతను అజిత్‌ను ఎత్తి భుజానవేసుకుని, గుర్రం మీద బయలుదేరాడు. అతను కొండ దిగుతూండగా పోలీసుదళం అతన్ని చుట్టుముట్టింది. జశ్పాల్ అజిత్‌ను కిందికి దించాడు. ఇద్దరూ పట్టుబడ్డారు.

తరవాత దొంగలకూ, పోలీసులకూ భయంకరమైన పోరాటం జరిగి, అందులో షేర్‌సింగ్ గుండు దెబ్బతిని మరణించాడు. అతని అనుచరులలో చచ్చిన వాళ్ళు చావగా, మిగిలినవాళ్ళు దొరికిపోయారు. పోలీసు అధికారి కాపూర్ సహాయంతో అజిత్‌కు అయిదేళ్ళు మాత్రమే ఖైదు శిక్షపడింది. అయిదేళ్ళ అనంతరం అతను పెళ్ళాడి, జశ్పాల్‌తో సహా మంచి పౌరుడుగా జీవించాడు.



# వరహా అప్పు

విజయనగరంలో ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. ఆయన చాలా తెలివిగలవాడు. ఒక రోజున ఆయన ఒక ధనికుడి వద్దకు వెళ్ళి, తనకు ఒక వరహా అప్పు కావాలన్నాడు. ధనికుడు పదిశాతం వడ్డీ మీద వరహా అప్పుగా ఇయ్యటానికి ఒప్పుకుని, అప్పుకు గుర్తుగా ఏదైనా వస్తువు తాకట్టు ఉంచమన్నాడు.

"ఇది రాయలు నాకు బహూకరించారు. ఇది తాకట్టుకు సరిపోతుందనుకుంటాను," అంటూ ఆ బ్రాహ్మణుడు ఒక ముత్యాలహారం వర్తకుడికి ఇచ్చాడు. దాని విలువ కనీసం వెయ్యి వరహాలు ఉంటుంది. వర్తకుడు దాన్ని తీసుకుని, అది తన వద్ద తాకట్టు కింద ఉన్నట్టు రాసి ఇస్తూ, బ్రాహ్మణుడికి ఒక వరహా ఇచ్చాడు.

ఆటు తరవాత బ్రాహ్మణుడు ప్రతి ఏడూ వచ్చి వరహాలో పదోవంతు వడ్డీ మాత్రం ఇస్తూ వచ్చాడు. ఇలా అయిదు సంవత్సరాలు గడిచిన మీదట వ్యాపారస్తుడు, "ఏమండీ, ఇన్ని ఏళ్ళుగా వడ్డీ కట్టుతున్నారుగదా, అసలు చెల్లువెయ్యటానికి మీ వద్ద ఒక్క వరహా లేదా?" అని అడిగాడు.

బ్రాహ్మణుడు నవ్వి, "నేను అట్టే ధనవంతుణ్ణి కాను. ఆ ముత్యాలహారం దాచటానికి నా దగ్గిర ఇనప్పెట్టె లేదు, కొనటానికి నా దగ్గిర డబ్బూలేదు. అందుచేత అతిస్వల్ప ఖర్చుతో మీ దగ్గిర సురక్షితంగా దాచుకున్నాను," అన్నాడు. —మల్లాది వెంకటకృష్ణమూర్తి





# నేతిగారెలు

ఒక ఊళ్ళో ఇద్దరు బ్రాహ్మణ దంపతులు ఉండేవాళ్ళు. ఒకనాడు బ్రాహ్మణుడి బావమరిదీ, అతని భార్యా చుట్టపు చూపుగా వచ్చారు.

"మీ అన్నయ్యా, వదినా రాకరాక వచ్చారు. వాళ్ళకు ఏదైనా మంచి పిండి వంట చెయ్యి." అన్నాడు బ్రాహ్మణుడు తన భార్యతో.

"మా అన్నయ్యకు నేతి గారెలంటే చాలా ఇష్టం. కాని మన ఇంట్లో నేతి గారెలు చేసుకున్నామంటే సువాసన కొట్టి ఎరిగిన వాళ్ళంతా వచ్చి పడతారు. శ్రమా, డబ్బు ఖర్చూ తప్ప, చివరకు తినటానికి మనకేమీ మిగలదు." అన్నది బ్రాహ్మణుడి భార్య.

ఆ మాట మీద బ్రాహ్మణుడు ఒక ఆలోచన చేశాడు. పట్టపగలు నేతి గారెలు వండితే తన భార్య అన్నంత పనీ జరుగుతుంది. అందుచేత బ్రాహ్మణ దంపతులు ఊరికి పోతున్నామని నలుగురికీ చెప్పి, తల వాకిలికి తాళం పెట్టి, ఊరిబయటికి వెళ్ళినట్టు వెళ్ళి, రాత్రి పొద్దుపోగానే తిరిగి వచ్చి, రహస్యంగా దొడ్డి దారిన ఇంట ప్రవేశించారు.

బ్రాహ్మణుడి భార్య నేతి గారెలు వండ నారంభించింది. నేతి గారెల వాసన ఎవడికో తగలనే తగిలింది. అర్ధరాత్రి వేళ ఈ నేతి గారెల వాసన ఏమిటా అనుకుని వాడు తన ఇంట్లో నుంచి బయటికి వచ్చేటప్పటికి, ఎదురుగా ఉన్న బ్రాహ్మణుడి ఇంటి నుంచి సువాసన వస్తున్నట్టు తెలిసిపోయింది.

బ్రాహ్మణుడు ఇంటికి తాళం వేసి వెళ్ళిపోయాడు. ఇంటి నుంచి నేతిగారెల వాసన వస్తున్నది. ఈ వింత అర్థంకాక వాడు పదిమందికీ పోయి చెప్పాడు.

కుమారి సురభి రేవతి

బ్రాహ్మణుడి ఇంటి ముందు పెద్ద గుంపు తయారయింది. లోపలి నుంచి నేతిగారెల వాసన రావటమే గాక, గాజుల శబ్దం కూడా వినవస్తున్నది.

దీని అంతు తేల్చుకోవాలనుకుని, కొందరు తలుపు మీద దడదడా బాదుతూ, "ఎవరు లోపల? నిజం చెప్పండి. లేకపోతే డొక్క చీరేస్తాం!" అని కేకలు పెట్టారు.

ఈ కేకలకు లోపలివాళ్ళు వణికిపోయారు. అసలే పల్లెటూరు. గోరంత ఉంటే అక్కడివాళ్ళు కొండంత చేస్తారు. "ఎలాగురా, భగవంతుడా! ఏదో ఒకటి చెయ్యకపోతే తలుపులు బద్దలు కొట్టేస్తారు! వెధవ నేతి గారెల మూలాన మన ఇంట్లోనే మనం దొంగలమయామే!" అంటూ బ్రాహ్మణుడి భార్య విలవిలలాడసాగింది.

అప్పుడు బ్రాహ్మణుడి బావమరిదీ, అతని భార్యా ఒక ఉపాయం ఆలోచించారు. ముందు ఇద్దరు ఆడవాళ్ళూ తలుపు దగ్గిరికి వెళ్ళి, గాజులు గలగలలాడించారు.

ఆ వెంటనే బయటి కలకలం నిలిచిపోయింది. బయటివాళ్లు ఆశ్చర్యపోతూ, ఆలకిస్తున్నారు. వాళ్ళకు యిదేదో వింతగా తోచింది.

బ్రాహ్మణుడి బావమరిది భార్య, "స్వామీ, మహాలక్ష్మిని అయిన నాకు ఈ బ్రాహ్మణుడి ఇల్లు చాలటం లేదు.



వైకుంఠం నుంచి వచ్చినాక సరిఅయిన స్థానమే కుదరలేదు. ఈ అసౌకర్యాన్ని భరించలేను." అన్నది.

దానికి ఆమె భర్త, "అయితే మనం ఏం చేద్దామంటావు, దేవీ?" అని అడిగాడు.

"ఈ ఊరి పెద్దకాపు వెంకయ్య ఇంటికి పోదాం. ఆయన ఇల్లు బాగుంటుంది," అన్నది భార్య.

"అలాగే చేద్దాం, దేవీ! అంతా నీ యిష్టం. ఆ వెంకయ్య మనకెంతో భక్తుడు గదా," అన్నాడు భర్త.

ఈ సంభాషణ అంతా బయట ఉన్న జనం విన్నారు. వారిలో పెద్ద కాపు వెంకయ్య కూడా ఉన్నాడు. ఆయనా, ఆయన వెంట ఉన్న జనమూ లక్ష్మీదేవిని కళ్ళారా చూతామని వెంకయ్య ఇంటికి పరుగెతేశారు.

వెంకయ్య హడావుడీ, జనాలహడావుడీ చూసి వెంకయ్య భార్య ఆశ్చర్యపడింది. సంగతి అంతా విన్నాక ఆవిడ సంతోషానికి పట్టపగ్గాలు లేవు. ఆమె వెంటనే ఇల్లు అలికించి, ముగ్గులు వేయించింది. పక్క ఊరి నుంచి పురోహితుడు వచ్చి, ఘనంగా లక్ష్మీపూజ చేసి, సంభావన పుచ్చుకుని వెళ్ళిపోయాడు.

ఊళ్ళో ఉండే జనమంతా మహాలక్ష్మి ఎప్పుడు వస్తుందా అని చూస్తూ, వెంకయ్య ఇంటి వద్దనే ఉన్నారు. అందరికీ వెంకయ్య భార్య పంచభక్ష్య పరమాన్నాలతో విందు భోజనాలు పెట్టింది. ఎంత చూసినా ఎవరికీ మహాలక్ష్మి దర్శనం కాలేదు.

ఈ లోపల బ్రాహ్మణ దంపతులు తమ ఇంటి నుంచి బయటపడి, హడావుడి తగ్గిపోయేసమయానికి అప్పుడే పొరుగూరు నుంచే తిరిగి వచ్చినట్టు నటిస్తూ తమ ఇల్లు చేరుకున్నారు.

వెంకయ్యా, ఆయన భార్యా మటుకు లక్ష్మీదేవి అదృశ్యంగా వచ్చి తమ ఇంట స్థిరనివాసం ఏర్పాటు చేసుకున్నదని కలలుగన్నారు.





# దురభిప్రాయం

ఒక గ్రామంలో సోముడు అనే యువకుడు ఉండేవాడు. అతనికి చిన్నతనంలోనే తల్లి పోయింది. అతను యుక్త వయస్కుడు అయే తరుణంలో తండ్రి పోయాడు. తరవాత అతను తన గ్రామానికి కొంత దూరంలో ఉండే మరొక గ్రామంలో తనకు ఈడూ, జోడూ అయిన కన్యను చూసి, ఘనంగా పెళ్ళి చేసుకున్నాడు.

సోముడు పెళ్ళాడిన కన్య పేరు కాంతం. ఆమె చాలా చక్కనిది. ఆమెలో రూపానికి తగినట్టు గుణం కూడా ఉన్నదేమో పరీక్షించి తెలుసుకోవాలని సోముడికి అనిపించింది.

ఒకనాడు సోముడు మాటల సందర్భంలో తన భార్యను, "మన పెళ్ళికి ఎంత ఖర్చు అయి వుంటుందంటావు?" అని అడిగాడు.

"రెండు సోలల బియ్యం!" అన్నది కాంతం ముక్తసరిగా.

ఆ జవాబు విని సోముడు ఉగ్రుడయ్యాడు.

"నే నెంతో ఖర్చుపెట్టి వైభవంగా పెళ్ళి చేసుకుంటే, రెండు సోలల బియ్యంతో పెళ్ళి చేసుకున్నా నంటావా? నేను నీకు అంత దరిద్రుడిలాగా కనిపిస్తున్నానా? నీ వంటి మూర్ఖురాలికి ఈ ఇంట చోటు లేదు. తక్షణం బయలుదేరి, నీ పుట్టింటికి వెళ్ళిపో!" అని అతను కేకలు పెట్టాడు.

భర్త ఇలా విరుచుకుపడటం చూసి కాంతం చకితురాలయింది. కాని మానాభిమానాలు కలది కావటం చేత మారు పలకలేదు.

సోముడు ఆమెను ఆమె పుట్టింట దిగబెట్టి రావటానికి బయలుదేరాడు.

భైరవరపు కేశవరావు

ముందు భర్తా, కొంచెం వెనకగా భార్యా నడుస్తున్నారు.

వాళ్ళు కొంత దూరం వెళ్ళేసరికి, ఒక పొలంలో కొందరు మనుషులు ధాన్యం బస్తాలను రెండెడ్ల బళ్ళ మీదికి ఎక్కిస్తున్నారు.

కాంతం ఆగి, ధాన్యం బస్తాల కేసి చూస్తూ, "ఈ ధాన్యం పోయిన ఏటిదా, ఈ ఏటిదేనా?" అన్నది.

భార్య అడిగిన ఆ పిచ్చి ప్రశ్నకు చీదరించుకుని సోముడు ముందుకు నడిచాడు.

వాళ్ళు మరి కొంత దూరం వెళ్ళాక కొందరు మనుషులు శవాన్ని మోసుకుంటూ ఎదురయారు.

కాంతం ఆ శవం వెంట ఉన్నవాళ్ళను, "ఒక శవమేనా లేక వంద శవాలా?" అని అడిగింది.

ఆ మాట విని సోముడు తన భార్య మెదడు పూర్తిగా చెడిపోయి ఉంటుం దనుకున్నాడు. అలాంటి వెర్రిదాన్ని వదిలెయ్యటంలో ఏ మాత్రం తప్పులేదని అతనికి తోచింది.

చాలాదూరం నడిచి వాళ్ళు ఒక చెట్టు కింద కూర్చున్నారు. దారికి కొంత దూరాన ఒక కాకి గెంతుతూ, మాటి మాటికీ నేలను పొడుస్తూండటం వాళ్ళకు కనిపించింది. కాంతం ఆ కాకిని కొంత సేపు గమనించి, "అక్కడ తవ్వితే నిధి దొరకవచ్చు." అని భర్తతో అన్నది.



సోముడు దీన్నికూడా తన భార్య వెర్రే అనుకున్నాడు. కాని ఆమె లేచి వెళ్ళి, ఆ స్థలం పరీక్ష చేస్తే అది కొత్తగా పూడ్చిన ప్రదేశంగా కనిపించింది. ఆమె గట్టిపుల్ల తీసుకుని మట్టి తవ్వింది. మూరెడు లోతున ఒక కుండా, దాని మూతలో ఏవో ఆహారపదార్థాలూ కనిపించాయి.

ఆ కుండలో బంగారం ఉన్నది. అది చూసి సోముడు నిర్ఘాంతపోయాడు. తన భార్య తాను అనుకున్న దానికన్న తెలివి గలదేనేమోనని అతనికి ఇప్పుడు పెద్ద అనుమానం కలిగింది.

"ఇక్కడ నిధి ఉన్నదని నీకు ఎలా తెలిసింది?" అని అతను భార్యను అడిగాడు.

"అనుమానం తగిలింది. మట్టిని కాకి ఎందుకు పొడవాలి? నేల దిగువన ఏదో ఆహారం ఉంది ఉండాలి. ఎవరన్నా ఆహారం ఎందుకు పూడ్చిపెడతారు? ఏదన్నా విలువైనది పూడ్చి పెట్టినప్పుడు దానికి రక్షగా భూతాలు ఉండగలందులకుగాను, ఏదైనా బలి పెట్టుతారు." అన్నది కాంతం.

కాంతం బుద్ధి సూక్ష్మమైనదేనని సోముడు ఒప్పుకోక తప్పలేదు. అలాటి మనిషి లోగడ అంత పిచ్చిగా ఎందుకు మాట్లాడింది?

"ఎవరో శవాన్ని మోసుకు పోతుంటే, ఒక శవమా, నూరుశవాలా అని ఎందుకు అడిగావు? ఒక పాడె మీద ఒక శవమే



గదా ఉంటుంది ?'' అని అతను భార్యను అడిగాడు.

'' ఆ చచ్చిపోయినవాడు పదిమందికీ బతికుండగా సహాయపడిన వాడైతే వాడి చావు నూరుమంది చావుతో సమానం. తన కోసమే తాను బతికిన వాడైతే వాడి చావు వాడిదే. ఆ చచ్చిపోయిన మనిషి లోకోపకారి అవునా, కాదా అని అడిగాను,'' అన్నది కాంతం.

ఆమె మాటలో ఆ అర్థం ఉన్నట్టు సోముడు ఒప్పుకోవలసి వచ్చింది.

'' పొలంలో ధాన్యం చూస్తూ, ఈ ఏటి పంటా? కిందటేడుపంటా? అని ఎందుకు అడిగావు ? '' అన్నాడు సోముడు.

'' అప్పులూ, పన్నులూ అన్నీపోగా మిగిలితే అది కిందటేటి పంట. ఆ బస్తాలన్నీ భూస్వామి సొంతమన్నమాట. అందులో నుంచి అప్పులు తీర్చి, పన్నులు చెల్లించవలసి ఉంటే ఆ బస్తాలలో భూస్వామికి మిగిలేవి కొన్నిమాత్రమే. ఆ ధాన్యం బస్తాలన్నీ భూస్వామి గాదెలు చేరుతాయా లేదా అని తెలుసుకునేటందుకు అలా అడిగాను,'' అన్నది కాంతం.

ఆమె వివరించిన మీదట ఆమె ప్రశ్న తెలివైనదేనని సోముడు ఒప్పుకోవలసి వచ్చింది.

'' అంతా బాగానే ఉన్నదిగాని, మన పెళ్ళికి అయిన ఖర్చు రెండు సోలల బియ్యమేనని ఎందుకు అన్నావు ?'' అని సోముడు భార్యను అడిగాడు.

'' మీరు మీ గొప్పతనం ప్రదర్శించుకునేటందుకు ఎంత ఖర్చు అయినా పెట్టి ఉండవచ్చు. కాని అది నిజమైన పెళ్ళి ఖర్చు కాదు. మీ అప్తులకు ప్రేమతో, ఆప్యాయంగా చేసిన ఖర్చే నిజమైన ఖర్చు. అది రెండు సోలల బియ్యం అన్నాను.'' అన్నది కాంతం.

ఈ సమాధానం విన్నమీదట సోముడు తన భార్యకు క్షమాపణ చెప్పుకుని, ఆమెతో సహా ఇంటికి తిరిగి వచ్చి, ఆమెను ఎంతో గౌరవంగా చూసుకున్నాడు.





# మోసకారి రాకుమారి

పూర్వం కళింగరాజ్యాన్ని ఏలిన ఒక రాజుకు ఒక కుమార్తె ఉండేది. ఆమె చాలా గొప్ప సౌందర్యవతి. అయితే ఆమె ఇతరులను అతిసులువుగా మోసగించేది.

ఆమెకు యుక్తవయసు రాగానే, రాజు ఆమె పెళ్ళి తలపెట్టాడు. అందుకు రాకుమారి ఒప్పుకున్నది. కాని, తనను మోసగించగలవాడూ, తన మోసాన్ని బయటపెట్టగలవాడూ అయితేనే తాను పెళ్ళాడతానని ఆమె తండ్రికి చెప్పింది. రాజు తన కూతురు ఎలా ఆడిస్తే అలా ఆడేవాడు కావటంచేత ఆమె చెప్పిన ప్రకారమే చాటింపు వేయించాడు.

"కళింగ రాజకుమార్తెను పెళ్ళాడ దలచినవారు ఆమెమోసాన్ని బట్ట బయలు చెయ్యటమే గాక, ఆమెను విజయవంతంగా మోసగించాలి. అలాటి వాడినే ఆమె వివాహమాడుతుంది," అన్న చాటింపు విని, చుట్టుపక్కల దేశాలనుంచి ఎందరో రాజకుమారులు ఆమెను పెళ్ళాడే ఆశతో వచ్చారు.

అయితే రాజకుమార్తె తన వద్దకు వచ్చినవారి నందరినీ రకరకాలుగా మోసగించి, అవమానించి పంపేసింది. అవమానానికి భయపడినవారు ఆమెను పెళ్ళాడే ప్రయత్నం నుంచి విరమించుకుని వెళ్ళిపోయారు. ఆమె ఏ ఇద్దరినీ ఒకే రకంగా మోసగించకపోవటం చేత ఆమె ఎలా మోసం చేస్తుందో కనుక్కోవటం ఎవరికీ సాధ్యం కాలేదు.

చాటింపు సంగతి తెలిసి అంగదేశపు రాజకుమారుడు కళింగ రాకుమారిని పెళ్ళాడే ఉద్దేశంతో తన అంగరక్షకుణ్ణి వెంటబెట్టుకుని కళింగదేశం వచ్చి, ఒక సత్రంలో దిగాడు. అతని రాక గురించి చారుల ద్వారా రాకుమారికి తెలిసింది.

వీరేపల్లి జయరాంరెడ్డి

మర్నాడు అంగదేశపు రాకుమారుడు తన అంగరక్షకుణ్ణి వెంటబెట్టుకుని రాజ భవనానికి వచ్చి, రాకుమారితో మాట్లాడ వచ్చినట్టు కబురు చేశాడు. వారిద్దరినీ రాజకుమార్తె తన మందిరానికి పిలిపించు కున్నది. వాళ్ళు అక్కడికి వచ్చేసరికి రాజకుమార్తె వెంట ఒక చెలికత్తె మాత్రమే ఉన్నది.

చెలికత్తె అతిథులను మర్యాదగా కూర్చోబెట్టి, రాజకుమారుణ్ణి, "మీరు మా రాకుమారిని ఓడించి పెళ్ళాడడానికి వచ్చారా? లేక, ప్రేమించి పెళ్ళాడ వచ్చారా?" అని అడిగింది.

దానికి అంగరక్షకుడు, "మా రాకుమారుడు మీ రాకుమారిని మనస్ఫూర్తిగా ప్రేమించి, పెళ్ళాడేటందుకే వచ్చాడు. అందుకోసం ఆమె పెట్టే ఏ పరీక్షలకైనా సిద్ధమే," అన్నాడు.

"మా రాకుమారి ఎలాటి పరీక్షలూ పెట్టదు. మీరు ఆమెను త్రికరణశుద్ధిగా ప్రేమిస్తున్నట్టు ఆమె చేతిలో చెయ్యివేసి ప్రమాణం చెయ్యండి, చాలు!" అని చెలికత్తె రాకుమారుడితో అన్నది.

రాకుమారుడు రాకుమారిని సమీపించి ఆమె చేతిలో చెయ్యి వేశాడు. వెంటనే చెలికత్తె విరగబడి నవ్వనారంభించింది.

తరవాత ఆమె విజయగర్వంతో, "రాకుమారా, మీరు మోసపోయారు. ఇంత వరకూ మీరు రాకుమారి అనుకుంటున్నది నా పరిచారిక. అసలు రాకుమారిని నేను," అన్నది అప్పటిదాకా చెలికత్తెలాగా నటించిన రాకుమారి.

అప్పుడు అంగరక్షకుడు ఆమెతో, "మోసపోయినది మీరే, నేను కాదు. ఇప్పటివరకూ మీరు మాట్లాడుతున్నది నా అంగరక్షకుడితో. అసలు అంగరాజకుమారుణ్ణి నేను. ఇలాంటి మోసం ఏదో జరుగుతుందని ఊహించి నేను ఈ వేషం ధరించాను," అన్నాడు.

కళింగ రాజకుమారి సిగ్గుపడి, తాను ఓడిపోయినట్టు ఒప్పుకున్నది. వారిద్దరికీ వివాహం జరిగింది.






హనుమంతుడు సీతను తలుచుకుని ఒక నమస్కారం చేసి, ఇలా చెప్పాడు:

"నేను మహేంద్రపర్వతం మీది నుంచి ఎగరటం మీరందరూ చూశారుగదా. నేను ఆకాశంలో పోతూండగా ఒక అందమైన బంగారు శిఖరం నా దారికి అడ్డంగా పైకి లేచింది. నేను దాన్ని బద్దలు కొట్టుదామనుకున్నాను. కాని అది నన్ను ఎంతో వాత్సల్యంతో పలకరించి, నా తండ్రి వాయుదేవుడు తనను ఇంద్రుడి బారి నుంచి కాపాడాడనీ, తన పేరు మైనాకుడనీ, రామకార్యం మీద పోతున్న నాకు సహాయం చేస్తాననీ అన్నది. నేను తొందరలో ఉన్నానని చెప్పి, మైనాకుడి వద్ద సెలవు పుచ్చుకుని, ముందుకు వెళ్ళాను. తరవాత, సర్పమాత అయిన సురస నన్ను మింగుతానని వచ్చింది. నేను అతి పవిత్రమైన పనిమీద పోతున్నాననీ, పని తీరగానే వచ్చి తనకు ఆహారమవుతాననీ చెప్పినా ఆమె వినిపించుకోలేదు. నేను అంగుళం ప్రమాణం గల దేహంతో సురస నోట దూరి, మరుక్షణం బయటికి వచ్చేశాను. తరవాత సురస నన్ను దీవించి మరీ పంపింది. మరి కొంతదూరం వెళ్ళాక నా నీడను ఏదో పట్టుకున్నది. అది సముద్రంలో ఉన్న ఒక భయంకర రాక్షసి. నేను చేసేదిలేక అతి చిన్న రూపంతో దాని లోపలికి ప్రవేశించి, దాని గుండె చీల్చి, బయటికి వచ్చాను. దాని పేరు సింహిక అని విన్నాను.

**17. మధువన విధ్వంసం**



''తరవాత నేను లంక చేరి, రహస్యంగా లంకా నగరం ప్రవేశించాను. అక్కడ లంక గొప్ప రాకసి రూపంలో నా ముందు నిలబడింది. నేను దాన్ని జయించి, సీత కోసం వెదకసాగాను. రావణుడి ఇంట సీత లేదు. ఆమె నాకు ఒక గొప్ప ఉద్యానంలో కనిపించింది. ఆమె కృశించి, జుట్టంతా జడ కట్టుకుపోయి, శోకదేవత లాగా, భయంకరులైన రాకసస్త్రీల మధ్య కనిపించింది.''

ఈ విధంగా హనుమంతుడు తాను చూచినదీ, చేసినదీ పూసగుచ్చినట్టు వానరులకు చెప్పాడు. చిట్టచివరకు అతను ఇలా అన్నాడు:

''సీత మహాపతివ్రత. ఆమెను చూడగానే నాకు ఆమెపట్ల ఎంతో భక్తికలిగింది. ఆమె వీరపత్ని. తన భర్తే రావణుణ్ణి చంపాలని ఆమె పట్టుదల. నేను ఒక మాట మీతో చెప్పాలని వచ్చాను. రావణుణ్ణి చంపటానికి మనం చాలుతాం. మనం అలాచేసి, సీతతో సహా రామలక్ష్మణుల వద్దకు పోవటం మంచిదని నా ఉద్దేశం. నిజానికి నేనే రావణుణ్ణి చంపగలను. ఇంద్రజిత్తు ప్రయోగించే అస్త్రాలు నన్నేమీ చెయ్యలేవు. మీరు సరేనంటే నేను ఇంద్రజిత్తును కూడా చంపేస్తాను. జాంబవంతుడూ, అంగదుడూ ఒంటరిగా రాకసులనందరినీ హతమార్చగలరు. ఎవరిచేతనూ చావకుండా వరం పొందిన మైందుడూ, ద్వివిదుడూ అనే మహాబలులైన రాకసులున్నారు. మీరు ఏమంటారు?''

అంగదుడు హనుమంతుడు చెప్పిన దానికి వెంటనే ఒప్పుకుని, ''ఔను! మనం సీతాదేవిని చూసినమీదట ఆమెను వెంట తీసుకుపోకుండా రాముడి దగ్గిరికి వెళ్ళటం చాలాతప్పు. 'సీతాదేవిని చూశాం గాని, ఆమెను తీసుకు రాలేదు,' అని రాముడితో ఎలా అనగలం? రాకసముఖ్యులనందరినీ హనుమంతుడు చంపనే చంపాడు. ఇక మనకు మిగిలినది

మాత్రం ఏమిటి? సీతాదేవిని తీసుకు పోదాం," అన్నాడు.

జాంబవంతుడు అంగదుడితో, "నువు చెప్పినదంతా బాగానే ఉన్నది. కాని మనం రాముడి ఆజ్ఞ ప్రకారమే నడుచుకో వలసిన వాళ్ళంకదా. అలా చేద్దాం," అన్నాడు.

రాముడు వానరులతో సీతను చూసి రమ్మన్నాడుగాని, సీతను తీసుకురమ్మన లేదు. సీత వాళ్ళ వెంట రావటానికి సిద్ధంగాలేదని హనుమంతుడు వానరులకు చెప్పాడు కూడా.

అందరూ జాంబవంతుడి ఆలోచనకు సమ్మతించారు. ఇక వాళ్ళు శీఘ్రంగా రాముడివద్దకు తిరిగివెళ్ళి, సీత కనిపించినవార్త చెప్పవలసి ఉన్నది. వానరులందరూ ఆకాశమార్గాన బయలుదేరి, భూలోకానికి నందనవనం అనదగిన మధువనం చేరారు. మధువనాన్ని కాపాడటానికి సుగ్రీవుడు తన మేనమామ అయిన దధిముఖుడు అనేవాణ్ణి నియమించాడు.

మధువనం చేరగానే వానరులు మధువు తాగటానికి అంగదుడి అనుమతి కోరారు. అంగదుడు సరేనన్నాడు. సీత కనిపించిన ఆనందంలో వానరులు తప్ప తాగి, ఒకరినొకరు ఇంకా, ఇంకా తాగమని



ప్రోత్సహించుకుంటూ, నృత్యాలు చేశారు: కొందరు వెర్రి నవ్వులు నవ్వారు; మరి కొందరు ఒళ్ళు తెలియకుండా పడిపోయారు; కొందరు పరుగులు తీశారు; కొందరు ఎగిరారు; మరికొందరు కేకలు పెట్టారు; కొందరు చిన్న గుంపుగా భుజాలూ, భుజాలూపట్టుకుని తిరిగారు; కొందరు రహస్యాలు చెప్పుకున్నారు; కొందరు పాడారు; ఒకళ్ళమీద ఒకళ్ళు తూలుతూ, తప్పటడుగులు వేస్తూ పడ్డారు. ఒక్కడికి కూడా ఒంటి మీద సరిఅయిన స్పృహలేదు.

వానరులు వనంలో ఉన్న మధువంతా తాగెయ్యటమేగాక, చెట్లు కూడా పాడు



చెయ్యటం చూసి దధిముఖుడు ఆగ్రహించి, వానరులనందరినీ వనంలో నుంచి పొమ్మన్నాడు. ఎవరూ వినిపించుకోలేదు. అతను నయానా, భయానా వాళ్లను హెచ్చరించయత్నించాడు. వాళ్లు అతని మీదపడి గిల్లి, రక్కి, నానావిధాలుగా పీడించారు.

హనుమంతుడు వానరులతో, ''మీరు తాగండి. ఎవరు అడ్డం వస్తారో చూస్తాను.'' అంటూ ప్రోత్సాహం ఇచ్చాడు.

''హనుమంతుడు చెడ్డపని చెయ్యమన్నా చేస్తాను; మంచిపని చెయ్యమంటే ఎందుకు చెయ్యనూ?'' అన్నాడు అంగదుడు, మైకంలో.

అంగదుడి మాటలకు వానరులు హర్షించారు. వాళ్ళు తమకు అడ్డం వచ్చిన కావలివాళ్ళను కొట్టి, మధువు తాగుతూ చెట్ల మీది పళ్ళన్నీ తిన్నారు. వాళ్ళను అడ్డేవాళ్ళు లేకపోయారు. మొత్తం మీద మధువనం నాశనమయింది.

దధిముఖుడు ఈ దురాగతాన్ని చూస్తూ ఊరుకోలేక, తన బలగాన్ని తీసుకుని భయంకరంగా అరుస్తూ, వానరుల మీదికి యుద్ధానికి వచ్చాడు.

అంగదుడు, దధిముఖుడు తన తాత అన్నది కూడా పాటించకుండా, అతన్ని చావగొట్టాడు. ఇక చేసేదిలేక దధిముఖుడు తన వాళ్ళను వెంటబెట్టుకుని సుగ్రీవుడి వద్దకు వెళ్ళాడు.

దధిముఖుడు వచ్చి తన కాళ్ళమీద పడగానే సుగ్రీవుడు, ఏం కొంప మునిగిందోనని భయపడి, ''అయ్యో, నా కాళ్ళ మీద పడ్డావేమిటి? లే, లే! నీ కేమీ భయం లేదు. ఏం జరిగిందో చెప్పు. మధువనంలో అల్లరి ఏమీ లేదు గద?'' అన్నాడు.

''రాజా, నీ తండ్రి ఋక్షరజుడి కాలంలోగాని, నీ కాలంలోగాని ఎవరూ చెయ్యసాహసించని అన్యాయం మధువనానికి ఈ నాడు జరిగింది. అంగదుడు



మొదలైన వానరులు అందులోకి ప్రవేశించి, అడ్డం వచ్చినవాళ్ళను చావగొట్టి, తాగినంత మధువుతాగి, పారబోసినంత పారపోశారు. నీ భయం కూడా వాళ్ళకు లేకుండా పోయింది.'' అన్నాడు దధిముఖుడు.

దధిముఖుడు సుగ్రీవుడి వద్దకు వచ్చినది, అతని వెంట రామలక్ష్మణులున్న చోటికి. దధిముఖుడు దేనికి వేదనపడుతున్నాడో అర్థంకాక లక్ష్మణుడు సుగ్రీవుణ్ణి, ''ఇతను ఏమిటి చెబుతున్నాడు?'' అని అడిగాడు.

సుగ్రీవుడు లక్ష్మణుడితో, ''మనం సీతను వెతకటానికి దక్షిణంగా పంపిన వానరులు మధువనం చేరి అక్కడ తప్ప తాగి, నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తున్నారట. వాళ్లు సీతను చూసి ఉండాలి; లేకపోతే వాళ్ళు మధువనాన్ని చెరిచేటంత సాహసం చెయ్యరు. వారిలో హనుమంతుడు తప్పక సీత జాడను తెలుసుకోగలిగి ఉంటాడు. ఈ పని అతని వల్ల తప్ప మరొకరి వల్ల కాదు. జాంబవంతుడూ, అంగదుడూ, హనుమంతుడూ ఏకమైతే అపజయం ఉండదు. లక్ష్మణా, నువు కూడా ఆలోచించు, వాళ్ళు సీతను చూసి ఉండకపోతే ఇలా ప్రవర్తించరు. మధువనం నా తండ్రికి బ్రహ్మదేవుడు ఇచ్చినది!'' అన్నాడు.

ఈ మాట విని రామలక్ష్మణులు చాలా ఆనందించారు.

సుగ్రీవుడు దధిముఖుడితో, ''వానరులు మధువు తాగితే తాగనీ. పని చేసుకుని వచ్చారు గనుక నేను వారిని క్షమించ గలను. వాళ్ళు వెళ్ళిన పని ఎలా చేసుకు వచ్చారో వినాలని నేనూ, రామలక్ష్మణులూ కుతూహలపడుతున్నాం,'' అన్నాడు.

దధిముఖుడు సుగ్రీవుడికీ, రామ, లక్ష్మణులకూ నమస్కారాలు పెట్టి, దిగులు తీరిపోయి, వచ్చినట్లుగానే తిరిగి మధువనానికి వెళ్ళి, ''అంగదుడా, మా

వాళ్ళు నిన్ను అడ్డగించారని కోపం పెట్టు కోకు. నువా యువరాజువు! ఈ మధు వనం మీద నీకు ఎంత అధికారమైనా ఉన్నది. మాదే పొరపాటు! క్షమించు. మీరంతా ఇక్కడికి విచ్చేశారని సుగ్రీవుడు ఎంతో సంతోషించాడు. మిమ్మల్నందరినీ వెంటనే పంపమని చెప్పాడు.'' అన్నాడు.

అంగదుడు వానరులతో, ''మనం ఇక్కడికి వచ్చిన వార్త రాముడికి తెలిసినట్టున్నది. మనం ఇక వెళ్ళకపోవటం మంచిదికాదు. అందరూ బాగా తాగి సేద దేరారు గనక, ఇక్కడ మన కింకేం పని?'' అన్నాడు.

వానరులు బయలుదేరటానికి సిద్ధంగానే ఉన్నారు. అంగదుడు ఆజ్ఞాపించకపోయినా, అతని మాట వారికి ఆజ్ఞే. అంగదుడు ఆకాశంలోకి లేవగానే వానరులంతా లేచారు. వాళ్లు మేఘాలలాగా గర్జిస్తూ సుగ్రీవుడి వద్దకు బయలుదేరారు.

ఈ సమయంలో సుగ్రీవుడు రాముడితో, ''వానరులు సీతను చూసి వచ్చారనటానికి సందేహం ఏమీ లేదు. నేను పెట్టిన గడువు దాటిపోయిన ఇంత కాలానికి వాళ్ళు తిరిగి రానేరారు. అంగదుడు పని పూర్తిచెయ్యకుండా నన్ను చూడ



లేడు; మొదలు, మధువనంలో అలా ప్రవర్తించడు. సీత సమాచారం తెలిసిందే అనుకోవచ్చు. ఇక నీ దుఃఖం తీరినట్టే!'' అన్నాడు.

అదే సమయంలో వానరులు ఆకాశంలో ఎగురుతూచేసే సింహనాదాలు వినవచ్చాయి. మరి కొద్దిక్షణాలు గడిచేసరికి వానరులందరూ సుగ్రీవుడి ముందు వాలారు.

హనుమంతుడు రాముడికి సాష్టాంగ నమస్కారం చేసి, ''చూశాను సీతను! ఆమె క్షేమంగా ఉన్నది.'' అన్నాడు. రాముడు అతని కేసి ఎంతో ఆప్యాయంగా చూశాడు.

అతను వానరులతో, "వానరులారా, సీతాదేవి ఎక్కడ ఉన్నది? నా పట్ల ఆమె భావం ఎలా ఉన్నది? ఏమీ దాచకుండా, అంతా నాకు వివరంగా చెప్పండి," అన్నాడు.

మిగిలిన వానరులు హనుమంతుడితో, "నువు చెప్పు," అన్నారు.

హనుమంతుడు సీత ఉన్న దిక్కుకు తిరిగి దణ్ణం పెట్టి, ఆమె తనకు ఇచ్చిన మణిని రాముడికి ఇచ్చి, తాను సీతాదేవిని ఎలా చూసినదీ చెప్పాడు:

"నేను నూరు యోజనాలు గల సముద్రాన్ని దాటి సీతాదేవిని వెతకటానికి వెళ్ళాను. అక్కడ రావణుడు ఉండే లంకాపట్టణం ఉన్నది. ఆ లంకలో సీతాదేవి రాక్షసస్త్రీల నడుమ కృశించి జీవిస్తున్నది. ఆమె అనుభవిస్తున్న కష్టాలు ఆమెకు రావలసినవి కావు. నేను ఆమెను చూసే సమయానికి ఆమె ఆత్మహత్య చేసుకోవాలని నిశ్చయించుకుని ఉన్నది. నేను ఎలాగో ఆమెకు నమ్మకం కలిగించి, ఆమెతో మాట్లాడాను. మీరు చిత్రకూటపర్వతం మీద ఉండగా జరిగిన ఒక కాకి వృత్తాంతం నీకు గుర్తుగా చెప్పింది. ఆమె నీ చూడామణిని ఎంతో శ్రద్ధగా కాపాడిందట. తాను యింక ఒక్క నెల మాత్రమే జీవించి ఉండగలనని నీకూ, సుగ్రీవుడికీ చెప్పమన్నది. అందుచేత, సముద్రం దాటే ఉపాయం ఏదో ఆలోచించండి."

హమంతుడిచ్చిన చూడామణిని రొమ్ము మీద పెట్టుకుని, రాముడు భోరున ఏడ్చాడు. అతనితో బాటు లక్ష్మణుడు కూడా ఏడ్చాడు. కళ్ళనీళ్ళు కారుతూనే, రాముడు సుగ్రీవుడితో, "ఈ చూడామణిని చూడగానే నా గుండె ద్రవించిపోతున్నది. దీన్ని జనకుడు సీతకు ఇచ్చాడు. పెళ్ళిసమయంలో సీత దాన్ని తలలో పెట్టుకున్నది. దీన్ని చూస్తే నాకు దశరథుణ్ణీ, జనకుణ్ణీ చూసినట్టుగా ఉన్నది; సీతను చూసినట్టు కూడా ఉన్నది," అన్నాడు.






యా స్వసద్మని పద్మేపి సంధ్యావధి విజృంభతే
ఇందిరా మందిరేన్యేషాం కథం తిష్ఠతి సా చిరం? 1

[తన సొంత ఇల్లు అయిన పద్మంలో నుంచే సాయంత్రం కాగానే వెళ్ళిపోయే లక్ష్మి ఇతర ఇళ్ళలో స్థిరంగా ఎలా నిలుస్తుంది?]

భీతా లక్ష్మీః కురంగీవ దూరం దూరం పలాయతే
గుణినం జన మాలోక్య నిజబంధనశంకయా. 2

[గుణం అంటే తాడు అనే అర్థం కూడా ఉన్నది. గుణవంతులు తనను బంధించుతారని భయపడి వారి నుంచి దూరంగా, లక్ష్మి జింక లాగా పారిపోతుంది.]

"శూరం త్యజామి వైధవ్యాత్, ఉదార మవమానాత్,
సాపత్న్యాత్ పండిత మపి, తస్మాత్ కృపణ మాశ్రయే." 3

[లక్ష్మి ఇలా అనుకుంటుందిట: "శూరుణ్ణి ఆశ్రయిస్తే వైధవ్యం రావచ్చు; ఉదారుణ్ణి ఆశ్రయిస్తే వాడు నన్ను ఎవరికైనా దానం చెయ్యవచ్చు; పండితుణ్ణి ఆశ్రయిస్తే నాకు సరస్వతితో సవతిపోరు వస్తుంది. అందుచేత లోభివాణ్ణి ఆశ్రయిస్తాను."]

గోభిః క్రీడితవాన్ కృష్ణ ఇతి, గోసమబుద్ధిభిః
క్రీడ త్యద్యాపి సా లక్ష్మీ రహో దేవీ పతివ్రతా! 4

[తన భర్త అయిన కృష్ణుడు గోవులతో తిరిగాడు గదా అని లక్ష్మి పశుతుల్యులతో తిరుగుతున్నది. ఎంత పతివ్రత!]

లక్ష్మీ నింద

Photo by S. G. Seshagiry



బహుమతి
పొందిన వ్యాఖ్య

కొట్టు కొనమంటున్నది

పంపినవారు :
జి. ఆర్. పి. చెట్టి

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు







★ వ్యాఖ్యలు ఫిబ్రవరి 20వ తేదీలోగా చేరాలి. వ్యాఖ్యలు పోస్టుకార్డుపైనమాత్రమే రాయాలి.
★ వ్యాఖ్యలు ఒక్కమాటలో గాని, చిన్న వాక్యంలో గాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు ఏప్రిల్ నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట:
సవారీ చెయ్యి

మూడవ అట్ట:
దణ్ణం పెట్టు

Printed by B. V. REDDI at Prasad Process Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras 600 026 : Controlling Editor : NAGI REDDI




# గ్లూకోస్ బిస్కట్ల మాటకొస్తే
# క్వాలిటీ తప్ప వేరొకటి వద్దు

సహజమే మరి! మంచి బిస్కట్లలో
వుండవలసిన వాటినన్నింటినీ క్వాలిటీ
గ్లూకోస్ బిస్కట్లు కలిగివున్నవి.
పిండివంటల రుచి. ఆహారపు పుష్టికూడా!

క్వాలిటీ అంటే ఉత్తమమైన బిస్కట్లు అన్నమాట




క్వాలిటీ ఫుడ్ ప్రాడక్ట్స్

Rachana KFP-45 Tel



మన హీరోను వలలో వేసుకో బోయి, అతని వలలో చిక్కు కుంది మంజుల! యెవరికి ఎవరు చిక్కారో మనం చూడవలసింది చిత్రంలో !!

భాస్కరరావు & బ్రహ్మయ్య సమర్పించు

పద్మజయ ప్రొడక్షన్స్ వారి

# వజ్రాల దొంగ



ఈస్ట్‌మన్ కలర్

నిర్మాతలు: N.కుమారస్వామి-M.సత్యం





VIJAYA

విజయా రిలీజు

Ketha ARTS

